ఆంధ్రప్రదేశ్ డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్స్‌వారు
L. Dis. No. 6215/V2/68. D/19-7-1968 లో
ఉత్తర్వు లొసంగి యున్నారు.

ఆంధ్రప్రదేశ్ డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ లైబ్రరీవారు
R. C. No 188-A 4/68 D/13-8-1968 లో
ఉత్తర్వు లొసంగి యున్నారు.

వారు పంపిన ఉత్తర్వు ఫలితముగా ఈ కథానాయకుని చరిత్ర చరిత్రాత్మకమై ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని గ్రామ - పట్టణాలలో నెల కొని యుండగలదని ఆశిస్తున్నాను.

పై అధికారులకు నా సహస్రాభినందనలు.

పైవారి ఉత్తర్వు లందిన వెంటనే తమ తమ జిల్లాలలోని వారి వారి అనుబంధ సంస్థలకు తమ ఉత్తర్వులను అందజేసిన అన్ని జిల్లాల పరిషత్ ఛేర్మన్ - సెక్రటరీగార్లకున్నూ - విద్యా శాఖాధికారులకున్నూ నా అభినందన పరంపరలు.

టి. ఆర్. నగర్, నెల్లూరు-2
15-8-68

రచయిత :
పచ్చారి వెంకటేశ్వర్లు.

# ఉపోద్ఘాతము

ప్రథమ ముద్రణ జరిగిన ఐదు మాసముల లోగానే ద్వితీయముద్రణ జరుగుతుందని అనుకోలేదు.

అది నా ప్రతిభావిశేషము కాదు. కీ॥ శే॥ ఏ. సి. గారిపై దేశానికున్న అభిమానమనాలి.

రాష్ట్ర గవర్నమెంటువారు ఉత్తర్వు లిచ్చిన అనతికాలములోనే కొందరు మండల గ్రంథాలయాలధ్యక్షులు, ఉన్నత విద్యాలయాల ప్రధానోపాధ్యాయులు, పంచాయితి సమితి ప్రధానాధికారులు విరివిగా అర్డర్లంపినారంటే అది కథానాయకుని ప్రతిభావిశేషమనే అనాలి! అందుకు వారందరూ వందనీయులు.

ఆంగ్లభాషలో ఏ. సి. గారి సంగ్రహ చరిత్రను ఈ ద్వితీయ ముద్రణలో ప్రచురిస్తున్నందుకు సంతసిస్తున్నాము.

— రచయిత.

# AN OUTSKETCH OF THE BOOKLET IN ENGLISH

This is a booklet on the life and achievements of late Sri A C. Subba Reddy of Nellore Town, (Andhra Pradesh) written by "Praja Kavi" Sri Pachari Venkateswarlu.

It is in the garb of a folk-song(Burra-Katha), with humourous commentaries in prose wherever necessary.

The opinions on this booklet given by certain writers, by the heads of certain Educational institutions, by certain persons connected with press and also by those who were closely acquainted with late Sri A. C. Subba Reddy are included in the front pages of this booklet.

Importance of Mother India is first sung. Most of the prominent leaders of this country as also noteworthy leaders born in the State of Andhra Pradesh have been introduced and their greatness pictorially depicted in the song. Late Sri A. C. Subba Reddy, often known in these parts as "A. C", is adored by the poet as one of the prominent leaders of Andhra Pradesh and a patriot to the core.

The life sketch of A. C. from the date of his birth to the date of his demise is depicted in this booklet in clear, spoken language with the following facts.

# A C.'S LIFE SKETCH

—o—

Late Sri A. C. Subba Reddy was born at Rajahmundry on 17-3-1906 while his father late Sri Subba Rami Reddy was working there as a Police Official. A. C.'s mother was Smt. Narayanamma. At his birth, astrologers predicted that the child would become a great man and achieve fame in Andhra Pradesh.

He commenced his lower education at Nellore, his native place. He could complete it successfully even by his twelveth year, with due appreciation of his teachers.

For higher education he was sent to Madras, where he used to move about in pant, boot and tie in the fashion of a boy from a Jamindari family. Sri Kasu Brahmananda Reddy, Present Chief Minister of Andhra Pradesh, and Sri Rebala Dasaratharami Reddy of Nellore, were his class-mates then. He continued his education upto 1927 at Madras for eight years i. e up to his twentieth year.

Even while he was a boy of fifteen years he was married with Sowbhagyavathi Annapurnamma.

While studying his Intermediate Class at the Pachiappa's College, Madras he discontinued his studies at the call of Gandhiji to join the fight for freedom.

The death of his father on 14th July, 1928, was a matter of great sorrow to him.

Some time after the death of his father, A. C., is stated to have beheld in his dream the image of Venugopalaswamy, whose temple is in existance in Mulapet, Nellore Town, directing him to undertake the supervision of the Devasthanam.

In 1934, A. C., was elected as a Director of Central Co-operative Bank of which Sri Rebala Dasaradharami Reddy was unanimously elected as President.

In 1936, he was elected as President, Taluk Board.

In 1937, when the fight for the country's freedom was in full swing Nellore Town Municipal elections set in and A. C. was elected as Chairman of the Nellore Municipality. As Chairman of the Municipality he did much constructive work. He was helpful to the people of the town irrespective of caste

or creed. He could gain the good will of the citizens on account of the sincere interest evinced by him in fulfilling their want or redressing their grievence.

As desired by Sri Vemula Kurmaiah and other such Harijan leaders, A. C., while he was a Chairman of Nellore Municipality has allotted a site in Nellore Municipal area for starting a Harijan Hostel. Several Harijan boys were in enjoyment of the benefits of this hostel. This hostel is now in the control of Sri Y. Pattabhirama Reddy.

He participated in 1942 movement after tendering resignation to the Chairmanship of the Municipal Council and he underwent R. I. for six months in the Central Jail, Vellore

On 5-10-1949 he was again elected as Chairman, Nellore Municipality.

In November. 1952 also he was once more elected as Chairman Nellore Municipality.

In 1955 he contested from Nellore Assembly Constituency and was successful

He then rendered his services, as Chairman for a period of 3 years from 1957 successfully.

On 12th October 1959, A. C. was again elected as Chairman of the Nellore Municipal Council. He was responsible for getting drainage scheme sanctioned for Nellore Town. He was also equally responsible for getting the water supply scheme expanded and for getting the town electrified.

For some time he was Chairman of the Andhra Pradesh Marketing Federation.

When he was Vice chairman, Andhra Pradesh Congress Committee, there arose a contraversy as to who should be chosen as the Chief Minister of Andhra Pradesh. Sri A. C. with great thought and sagacity proposed the name of Sanjeevaiah, with a view to establish an example in selecting a Harijan as Chief Minister.

In the Ministry of Sanjeevaiah, A C. was taken as a Minister and he had therefore to tender resignation to the Chairmanship of Nellore Municipality as also to that of Tiru-Malai Tirupathi Devasthanam Board.

In General Elections of 1962 he contested from Rapur Constituency and came out successful. Sri N. Sanjeeva Reddy was elected as

Chief Minister of Andhra Pradesh and in his Ministry also A. C. was taken as a Minister with the portfolios of his choice.

Similarly in the General Elections of 1967 he contested from Rapur Constituency and was elected. This time A. C. proposed the name of Kasu Brahmananda Reddy as the Chief Minister of Andhra Pradesh. In the Ministry of K. Brahmananda Reddy (our present Chief Minister.) A. C. was taken as Home Minister

To his bad luck, while he was functioning as Home Minister of K Brahmananda Reddy, he became a victim to the most horrid and fatal disease, cancer. He was advised to take treatment at Madras. He underwent treatment at Cancer Institute, Adayar for some time and returned to Hyderabad. Due to exertion, and strain the disease relapsed. He was again taken to Madras and was admitted in a private Hospital. He stayed at H. T. Veera Reddy Hospital for treatment but in vain. After treatment for some time he breathed his last on 20th September, 1967.

His body was brought to Nellore, his home town and cremated on the banks of the River Pennar, with State Honour.

Thousands of people of Nellore and other distant places gathered on the banks of the River Pennar. Among them were Honourable Minister Sri Raghunadha Reddy, Honourable Chief Minister Sri Kasu Brahmananda Reddy, Honourable Minister Sri N. Chenchurama Naidu and Hon'ble Sri N. Sanjeeva Reddy, Speaker of Lok Sabha. All the citizens who gathred there and all the leaders who were present on the occasion expressed deep regrets for having lost a noted leader and a patriot of recognition.

In the last chapter, the story of soul is depicted with poetic vision and with impressions of the past life.



# అభినందనలు

ఏ. సి. రెడ్డి చరిత్రను సంక్షిప్త ఆంగ్లభాషతో వ్రాసియిచ్చిన నెల్లూరు జిల్లా ట్రెజరీ ఆఫీసరు శ్రీ పైడిమఱ్ఱి సుబ్బారావుగారు ఎంతయో! వందనీయులు.

వారి అమూల్యకృషి ఫలితముగా తెలుగుభాష తెలియనివారందరు ఈ కథానాయకుని జీవిత విశేషాలు తెలుసుకొనే అవకాశమేర్పడినది, వారి కృషికి నా వినయపూర్వకాభినందనలు.

ఇంగ్లీషులో పైవారు వ్రాసినదంతయు ప్రచురించుట అవసరమనిచెప్పి ద్వితీయ ముద్రణకు వారి అమూల్యాభిప్రాయాన్నిచ్చి నన్నెంతయో ప్రోత్సహించిన మా జిల్లాపరిషత్ సెక్రటరీ శ్రీ పాశల క్రిష్ణారావుగారికి నా నమోవాక్కులు.

నిగర్వులూ, నిశ్చలహృదయులూ అయిన శ్రీ యస్. పి. బాలసుబ్రహ్మణ్యం అండ్ పార్టీ (సినీ నేపధ్యగాయకులు) వారు ఈ చరిత్రను (తెలుగు) యక్షగాన రూపములో రికార్డుచేసి ఆంధ్ర ప్రజానీకాని కందించుటకు పూనుకున్నారు. వారికిన్నీ-అన్ని వాద్యములతో వారి మధురస్వరానికి మెఱుగులు దిద్దుటకు సహకరించిన నెల్లూరు సంగీత నాటకసమాఖ్యవారికిన్నీ నా హృదయపూర్వకాభినందనలు.

— రచయిత :

వెంకటేశ్వర్లు.

## ఆనం చెంచుసుబ్బారెడ్డిగారి పవిత్రాత్మజ్యోతి

తే 17-3-1906 వ అర్ధరాత్రి 11-30 గంటలకు

"వెలుగు వెలిగింది వెలలేని తెలుగుజ్యోతి"

తే 20-9-1967 వ సాయంత్రం 5-40 గంటలకు

"ఆరి చేరింది ఆనాడె అమరపురికాంధ్రజ్యోతి"

## ఏ. సి. కాంస్య విగ్రహ ప్రతిష్ట

1968 సెప్టెంబరు తే 20 వ సాయంత్రము గం. 6-30 లకు
నెల్లూరుకు కేంద్రస్థానమయిన ఏ. సి. పార్కు కూడలిలో
వారి నిలువెత్తు కాంశ్యవిగ్రహము
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

**శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు**

ఆవిష్కరింతురు.
కేంద్ర పారిశ్రామిక సహాయమంత్రి

**శ్రీ కె. వి. రఘునాధరెడ్డిగారు**

మరికొందరు రాష్ట్రమంత్రులు, తదితర పెద్దలు
యీ కార్యక్రమంలో పాల్గొందురు.
ఏ. సి. కాంశ్యవిగ్రహ ప్రతిష్ఠాపకసంఘ కన్వీనరుగా

**దొడ్ల శేషారెడ్డిగారు**

నిర్వహించిరి.

# సమర్పణ

మాలక్ష్మిపురిలో వేంచేసిన మా ముఖ్యమైన స్వామి ॥
వేణుగోపాలుని కంకితమివ్వను ఏర్పడె నామనసు ॥



## ఓ పరమాత్మా!

పదహారువేల గోపికలతో
అష్టకళత్ర శోభాయమానుడవైన ఓ స్వామీ!
నాయీ కృతికన్యనుకూడా
నీకే అర్పణచేస్తున్నాను.
శాశ్వతంగా ఏలుకొంటూ నన్ను కృతార్థునిచేయి ప్రభూ!!

ప్రజాకవి
పచ్చారి వెంకటేశ్వర్లు.

# నాపలుకు

కవి, సృష్టికర్త మాత్రమే కాగలడు రచయిత,

దాన్ని దేశ-కాల-మాన పరిస్థితుల ననుసరించి, హావ భావ, నటనాచాతుర్యముతో సర్వజనామోదకరంగా రంగస్థలముపై రాణింప జేయగలవారు నటీ నటులు మాత్రమే, ఆదరాభిమానాలు గల ధాతృత్వం గల్గిన దాతలే వారికి పోషకులు. అట్టి పోషకులు లేనిదే ఏ కథా రాణించదు పైకి రానూలేదు.



సామాన్యమైన వారికథలే బహుళ ప్రచారములో యుంటగా, అనన్య సామాన్యులైన పి. సి. సుబ్బారెడ్డిగారి చరిత్ర అత్యున్నతస్థాయి నెందు కందుకోనదు? అందుకుంటుంది - కాని ఆదరణకావాలి.

సర్వజన నాయకులైన, పి. సి. చరిత్ర విశేషరాహిత్యాలు సహితం శ్రోతలుగా, తెలుసుకొనగలరనే యుద్దేశ్యమే నా యీ యక్షగాన రూపములో వెలువడిన చిఱుపొత్తము.

జనపద సాహిత్యముగా ప్రబంధకులు గుర్తింప ప్రార్థన.

— రచయిత.

# కృతజ్ఞత

నా యీ కృతికి రసవత్తరమయిన, వాక్యా లందిచ్చిన పూజ్యు లందరకున్నూ, పుస్తకాన్ని పూర్తిగాచూచి సలహాలిచ్చిన, శ్రీ గువ్వల వెంకటసుబ్బారెడ్డిగారికిన్నీ, చిత్తప్రతి ఆ మూలాగ్రముచూచి, బ్రహ్మాండముగా యున్నదని చెప్పి చరిత్రలో కొన్ని చేర్పులు చేర్పించిన శ్రీ నాగారెడ్డి హరిశ్చంద్రారెడ్డిగారికిన్నీ, యెప్పటికప్పుడు నా సందేహాలు దీర్చి నా కృతికి, తోడ్పడ్డ శ్రీ తుమ్మలచర్ల గోపాలకృష్ణయ్య గారికిన్నీ.

తే 17-3-1968 ది, గారి ఏ. సి. రెడ్డి 63-వ జయంతి రోజు యీ గ్రథావిష్కరణ జరిపించి. నన్ను సన్మానించిన, నెల్లూరు మండల రచయితల సంఘం వారికిన్నీ,

పుస్తకావిష్కరణ జరిపిన శ్రీ ఆర్. సుబ్బారెడ్డి, యం. ఏ. బి. ఇ. డి. (ప్రిన్సిపాల్, వి. ఆర్. కాలేజి) గారికిన్నీ, అనాటి సభకు అధ్యక్షత వహించిన పై సంఘాధ్యక్షులు బడి గురవారెడ్డి (వి. ఆర్. కాలేజీ ఆంధ్రోపన్యాసకులు) గారికిన్నీ, సకల ప్రజానీకాన్ని ఆహ్వానించి సభను జయప్రదము గావించిన పై సంఘ కార్యదర్శి ఆకుల సుబ్రహ్మణ్యం (సింహపురి ఎడిటర్) గారికిన్నీ,

మూలపేట శ్రీ వేణుగోపాలస్వామివారికి, అంకితము తీసికొన దలచిన ఆ దేవస్థానపు ధర్మకర్తలందరకున్నూ, అన్నగారైన స్వర్గీయ ఏ. సి. రెడ్డిగారి స్థానే తే 20-3-68 ది మేనేజింగ్ ట్రస్టీగా ఏకగ్రీవముగా ఎన్నికైన శ్రీ ఆనం వెంకటరెడ్డి (నెల్లూరు మునిసిపల్ ఛేర్మెన్) గారికిన్నీ నా కృతజ్ఞతాభివందనములు.

20-3-68
నెల్లూరు-2

పచ్చారి వెంకటేశ్వర్లు,

# అభిప్రాయ వేదిక



## దీపాల పిచ్చయ్యశాస్త్రి

ప్రజాకవి శ్రీ వచ్చారి వెంకటేశ్వర్లు, తాను రచించిన శ్రీ పి. సి. రెడ్డి జీవిత సంగ్రహము (యక్షగాన రూపకము) వినిపింపగా కొన్ని ఘట్టములు విన్నాను.

శ్రీ పి. సి. రెడ్డిగారి దేశసేవను, ప్రజాసేవను, వారి ధైర్య స్థైర్యౌదార్యములను విపులముగా వివరించుచు చక్కని జాతీయ భాషలో, రచన సర్వజనసుబోధముగా హృదయంగమముగా నున్నది.

దీపాల పిచ్చయ్యశాస్త్రి,
నెల్లూరు, 12-12 67.



## మోచర్ల రామకృష్ణయ్య

కీర్తిశేషులైన పి. సి. సుబ్బారెడ్డిగారినిగూర్చి వచ్చారి వెంకటేశ్వర్లు రచించిన బుఱ్ఱకథ దేశవ్యాప్తమైన ప్రచారమునకు రాగలిగిన సత్తాస్ఫూర్తులతో వెలయుచున్నది. ఇతోధిక రచనలు కావించు ప్రజ్ఞను చిరాయురభ్యుదయములను శ్రీనివాసుడు ఈ ప్రజాకవికి ప్రసాదించునుగాక !

సరసకవి, సాహిత్యరత్న
మోచర్ల రామకృష్ణయ్య,
కవితానికేతనం, నెల్లూరు, 19—12—67.

# శివారెడ్డి (జవిహాన్ రైతు)

శ్రీయుతులు వచ్చారి వెంకటేశ్వర్లుగారికి నమోవాకములు. మీ ఆదేశానుసారం నాలుగు పద్యములుమాత్రం వ్రాసిపంపుచున్నాను.

అమరజీవి పి. సి. అమహామహా దివ్య
గాథ చెవులకింపుగా రచించి
తెలుగుజాతి పేరునిలిపినావు "వచ్చారి"
కవికుమార చెప్పగావలదె నిన్ను.

పాటలల్లవచ్చు పద్యాలువ్రాయొచ్చు
గద్యరచనమునకు గడగవచ్చు
బుఱ్ఱకథరచించి బోషింపగారాదు
నవరసాలుజారు నవ్యగీతి.

సామాన్యమైన కవులకు
ఏమాత్రము సాధ్యపడదు పి. సి. చరిత్రం
బామూలాగ్రము గూర్చగ
నీమాదిరి సార్థకమ్ము నీజన్మయహో !

కోరిచూచినాను కొనదాక నీయది
గానమేను సావధానముగను
నవరసమ్ముగూర్చె ప్రతిమాట ప్రతిచోట
కైపువీడాదెచ్చి ! కలిపినావు !

శివారెడ్డి,
5-12-67.

## కాట్రగడ్డ రాజగోపాలరావు

నాలుగు దశాబ్దాలుగా ఆంధ్ర రాజకీయరంగంలో విశిష్టపాత్ర నిర్వర్తించి ప్రజాహృదయంలో పాదుకొన్న స్వర్గీయ శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డిగారి జీవితఘట్టాలను "ప్రజాకవి" శ్రీ వెంకటేశ్వర్లు బుఱ్ఱకథగా చిత్రీకరించడం ప్రశంసనీయం. కథ కమనీయంగాను, శైలి సరళంగాను, భాష మధురంగాను వుంది.

శ్రీ వెంకటేశ్వర్లు తన కలంతోను, కవితాస్రవంతితోను ప్రజారంజకమైన ప్రబోధరచనలు సాగించి కలకాలం వర్ధిల్లాలని శుభాకాంక్ష లందజేస్తున్నాను.

కాట్రగడ్డ రాజగోపాలరావు,
సంపాదకుడు : "విశాలాంధ్ర"
మకాం - నెల్లూరు, 25 12-67.

~~~~~~

## యస్. యస్. పంతులు

(ఏ. సి. గారి ఆంతరంగిక కార్యదర్శి)

కీర్తిశేషులు శ్రీ ఆనం చెంచుసుబ్బారెడ్డిగారి జీవిత చరిత్రను యక్షగాన రూపములో బుఱ్ఱకథను శ్రీ పచ్చారి వెంకటేశ్వర్లుగారు రచించి నెల్లూరు మండలములో అద్వితీయుడని పేరొందిన మహావ్యక్తి చేసిన సేవకు తగువైన కానుకగా నొసగిరి. శ్రీ రెడ్డిగారికి నాకు దాదాపు 40 సంవత్సరముల స్నేహము యుండినది. శ్రీ వెంకటేశ్వర్లుగారు శ్రీ రెడ్డిగారి జీవితవిశేషములను చక్కగా సేకరించి శీఘ్రకాలములో వారి రచన కావించినందులకు వారికి నా ధన్యవాదములు.

నపులూరు పంతులు,
3_12_67.
~~~~~~

# ఆర్. సుబ్బారెడ్డి (ప్రిన్సిపాల్)

నెల్లూరుమండల ఏకైకనాయకులు, నిస్వార్థపరులు, నిష్కపటి, నిష్కలంక రాజకీయజీవి, సింహపుర సింహము, ఉక్కుమనిషి, భోళాశంకరుడు అని సకల ప్రజానీకముచే, రాజకీయప్రముఖులచే ప్రశంసలందినవారు, అమాత్యశేఖరులు అయిన స్వర్గీయ శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డిగారి జీవితసంగ్రహమును ప్రజాకవి శ్రీ వెంకటేశ్వర్లుగారు బుఱ్ఱకథగా రచించి నాకు, నామిత్రులకు చదివి వినిపించినారు.

అందు స్వర్గీయ శ్రీ ఏ. సి. గారి బాల్యదశ, విద్యార్థిదశ, తదుపరి వారి రాజకీయజీవితము దాదాపు మూడు దశాబ్దములపాటు వారు పురపాలక సంఘాధ్యక్షులుగా నెల్లూరుపట్టణమునకుఁ జేసిన సేవ, ఇంకను తిరుపతి తిరుమలై దేవస్థాన పాలకవర్గాధ్యక్షులుగాను, వేంకటగిరిరాజాగారి కళాశాలా పాలకవర్గ కార్యదర్శిగాను, అధ్యక్షులుగాను, మరికొన్ని సంస్థలకు నధినేతగానుండి వారొనరించిన సేవ విపులతరముగను ప్రశంసార్హముగను నీ ప్రజాకవి గానముచేసియున్నారు.

వీరి శైలి మృదుమధురంగాను, పండిత పామర జనరంజకముగాను రసభరితముగా నున్నది. అందు ముఖ్యముగా స్వర్గారోహణ ఘట్టమునందలి వీరి కల్పనాచాతుర్యం ప్రశంసనీయము. అతి స్వల్పకాలములో నతినేర్పుతో స్వర్గీయ శ్రీ ఏ. సి. గారి జీవితమును గన్నులకుఁగట్టినట్లు రచించి వీరు నెల్లూరుపౌరులకేగాక యాంధ్రప్రజానీకమునకే యెనలేని సేవఁజేసి శాశ్వత కీర్తిప్రతిష్టల నార్జించిననారు.

ఆ సర్వేశ్వరుని కృపవలన వీరు మున్ముందత్యుత్తమ గ్రంథములను రచియించి యాంధ్ర ప్రజాహృదయమున నత్యున్నతాసనము నధివసింపఁగలరని నా దృఢవిశ్వాసము.

ఆర్. సుబ్బారెడ్డి (ప్రిన్సిపాల్),
వి. ఆర్. కాలేజి, నెల్లూరు, 10-12-67.

## రేబాల దమయంతీదేవి

సింహపురి ముద్దుబిడ్డడు, ప్రముఖ కాంగ్రెసువాదులు, దేశసేవా తత్పరులు, నిష్కపటి, ఉదాత్తుడునైన శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డిగారి జీవిత చరిత్ర యక్షగానంలా గానంచేయగలిగిన రచన వెలువడటం మన అదృష్టము. ఓ పఠనముద్వారా, ఓ ఉపన్యాసం వినుటద్వారానూ ఒక భావం హృదయములో ఏర్పడుతుంది. అదే పద్యానుగుణంగా అనగా గానయుక్తంగా కథాకాలక్షేపం జరిగినదా, ఇంకా సొంపుగా, గాఢంగా హృదయానికి హత్తుకుంటుంది. పూజ్యులు శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డిగారి చరిత్ర రాగయుక్తముగా రచించిన శ్రీ పచ్చారి వెంకటేశ్వర్లుగారి కృషికి నా కృతజ్ఞతాభివందనలు.

రేబాల దమయంతీదేవి,
7–12–1967.

~~~~~~

## సి. బి. గుప్తా (ప్రిన్సిపాల్)

ప్రముఖ ప్రజానాయకులు, అద్వితీయ కాంగ్రెసువాది, విశాల హృదయులు, అరమరికలులేని అమరజీవి, అమాత్యశేఖరులు స్వర్గీయ శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డిగారి జీవితసంగ్రహమును ప్రజాకవి శ్రీ పచ్చారి వెంకటేశ్వర్లుగారు యక్షగానరూపంలో రచించుట ముదావహము.

కరుణామయుడగు భగవంతుని కమనీయ కటాక్షవీక్షణలతో శ్రీ వెంకటేశ్వర్లుగారు ముమ్ముందు అనేక యుత్తమగ్రంథములను రచించి యావదాంధ్రప్రజల హృదయములలో నత్యుత్తమస్థానము నలంకరించగలరని దృఢముగ విశ్వసిస్తున్నాను.

సి. బి. గుప్తా (ప్రిన్సిపాల్)
గవర్నమెంటు పాలిటెక్నిక్, నెల్లూరు.
~~~~~~

# ఆకుల సుబ్రహ్మణ్యం

ప్రజానాయకులని పేరుబొందిన శ్రీ ఏ. సి. రెడ్డిగారి అమర గాథను యక్షగానంలో మధురాతిమధురముగా రచనగావించి తనూ ప్రజాకవిగా సుస్థిరసార్థకమయ్యాడని మిత్రులైన శ్రీ పచ్చారి వెంకటేశ్వర్లునుగురించి చెప్పవచ్చు.

యక్షగానం భాషతోబాటు, భావం పెనవేసుకొని వున్నప్పుడే శ్రోతలను తలలూపించగలుగుతుంది. అన్నిటికన్నా ముఖ్యం యక్షగానాలలో లయ కావాలి. ఏ కొండవాగులమీదనుంచో గానాలాపన జేస్తూ దూకుతున్న సెలయేటివాగులా భావగర్భితమైన భాష దొర్లందే ఏ 'కవిత' ప్రజాహృదయాలలో స్థానం సంపాదించుకొనజాలదు; పదికాలాలపాటు బ్రతకనూలేదు.

ఆవిధంగా చూచినపుడు యీప్రజాకవి వాటినన్నిటినీ జయించినాడనే చెప్పాలి. పచ్చారిగారి పలుకుబడుల్లో పరవళ్ళుత్రొక్కే భాషలో శ్రీ ఏ. సి. రెడ్డిగారి అమరగాథ అన్నివిధాలా అమరియున్నది.

శ్రీ ఏ. సి. రెడ్డిగారి బాల్యావస్థలుంచీ చనిపోయిందాకా వ్రాసినది ఒక ఎత్తైతే, తదుపరి వారి కలంనుంచి జాలువారిన అమరపురి మరియొక ఎత్తు.

ఈ కవిగారి కవితాచమత్కారంలో అమరపురిలా శ్రోతలకు, పాఠకులకు సింహపురీయులకు దర్శనం చేయిస్తాడు. కవి కలం యిక్కడ శ్రీ పచ్చారిగారి కలం సృష్టించిన అమరపురిలో శ్రీ ఏ. సి. రెడ్డిగారికి సన్మానకార్యక్రమాలు జరపటంలో కథ శుభాంతమౌతుంది.

నాకు మిత్రులు, ప్రజాకవులు అయిన శ్రీ పచ్చారి వెంకటేశ్వర్లు గారు భవిష్యత్తులోగూడా ఇంకా ప్రజాసాహిత్యాన్ని వెలారించి కవితకు, జనతకు సేవచేస్తారని ఆశిస్తూ—

మీ

నెల్లూరు, 20-12-68. ఆకుల సుబ్రహ్మణ్యం,

## నెల్లూరుజిల్లా వ్యవసాయకూలి ప్రెసిడెంటు

నెల్లూరుజిల్లా వ్యవసాయకూలిసంఘ ప్రెసిడెంటుగా ఏ. సి. 1942 మొదలు 1952 వరకు యుంటూ 42 చెరువుతొట్టి భూములను: లక్ష యకరములకు పైగా పై సంఘముద్వారా పేదప్రజానీకానికి పంపకము గావించారు. ఆ పొల మిప్పుడు సస్యశ్యామలముగా ఫలిస్తున్నది.

రుద్రకోట ఫారెస్టు గవర్నమెంటుకు తెలియకనే నరుకబడి వ్యవసాయముచేయదలచిన నిరుపేదలపై కేసులుమోపగా, 1955 లో రెవిన్యూమంత్రిగాయున్న కీ॥ శే॥ కళా వెంకట్రావుగారిని తీసుకొని వచ్చి వారిపై మోపబడ్డ కేసులు, పెనాల్టీలు రద్దుపర్చి కీర్తిగడించారు. (శ్రీ లేబూరు చంద్రారెడ్డిగారిద్వారా సేకరించాము.)

## చేనేతకాలనీ

ఏ. సి., అన్నపూర్ణమ్మగార్లు దంపతసమేతముగా 57 ఇండ్లు నిర్మించుటకు తే 10_12_61 ది వేదోక్తముగా పునాదిరాయి వేసి, గవర్నమెంటువద్ద కావలసిన సహాయం గ్రహించి, పూజ్యులైనారు. అవే ఇప్పుడు టి. ఆర్. నగర్ అనే పేరుతో 57 భవనములై, లక్ష్మీపురములో లక్ష్మీనివాసముగా యున్నవి.

## నెల్లూరు నూలుమిల్లు

తే 8_1_64 ది 73 లక్షలతో శాంక్షన్‌చేయించి 11_9_64 ఏ. సి. గారు పైమిల్లుకు ప్రారంభోత్సవము గావించారు. ఇప్పుడు కట్టడములు పూర్తవుతున్నవి. దీనికి యస్. గోపాలకృష్ణయ్యగారు చైర్మన్‌గా యున్నారు.

# ఆంధ్ర శాసనసభలో

## మంత్రిమండలిలో ఏ. సి.

1960 లో సంజీవయ్య మంత్రిమండలిలోచేరి భారీపరిశ్రమలు, గనులు, ఇండస్ట్రియల్ ట్రస్టుఫండ్, వాణిజ్య, గృహనిర్మాణం, పుర పాలక నిర్వహణశాఖల మంత్రిగా పనిజేశారు.

1962 సంజీవరెడ్డి మంత్రివర్గములో పి. డబ్ల్యు. డి. శాఖా మంత్రిగా యున్నారు. బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గములో ఇవే శాఖలు వున్నవి.

1967 లో బ్రహ్మానందరెడ్డి మంత్రిమండలిలో పోలీసు, గృహవ్యవహారాలు, ఆయుధాలచట్టం, సినిమా, ఫోటోగ్రఫీ వాణిజ్య పన్నుల మంత్రిగా చేరారు.

1960 మొదలు 66 వరకు నెల్లూరుజిల్లాకు నీటిపారుదలలో 131 స్కీములు, షుమారు రెండుకోట్ల రూపాయలకు పైగా శాంక్షన్ చేయించారు.

| తాలూకా | స్కీము | లక్షలలో | తాలూకా | స్కీము | లక్షలలో |
|---|---|---|---|---|---|
| నెల్లూరు | 2 | 1 | వెంకటగిరి | 2 | 4 |
| కోవూరు | 2 | 5 | కావలి | 9 | 11 |
| రాపూరు | 20 | 30 | కందుకూరు | 4 | 4 |
| ఆత్మకూరు | 15 | 33 | కనిగిరి | 19 | 45 |
| ఉదయగిరి | 35 | 37 | పొదిలి | 9 | 15 |
| గూడూరు | 7 | 10 | దర్శి | 7 | 12 |

మూలపేట శ్రీ వేణుగోపాలస్వామివారి ఆలయ స్థాపన 1870 ——లో స్వర్గీయ శ్రీ కంటాబత్తిన పాపిరెడ్డిగారివలన జరిగినది. వారు స్వర్గస్థులయిన పిమ్మట వారి ధర్మపత్ని శ్రీ సుబ్బమ్మగారు పుత్రసంతానములేక యావదాస్తిని శ్రీ స్వామివారికి 1883 సం॥ దానపత్రమువ్రాసి రిజిష్టరు చేయించారు. ఆలయ వ్యవహారాల విచారణార్థం ఐదుగురు ధర్మకర్తలను నియమిస్తూవారు, వారి సంతతి వారు వంశపారంపర్యంగా ధర్మకర్తృత్వం నెరవేర్చవలసినదిగా వ్రాసియిచ్చి ఆ పుణ్యదంపతులు శాశ్వతకీర్తిని అలంకరించారు.

మన ఏ. సి. గారు వారి తండ్రి స్వర్గీయ సుబ్బరామిరెడ్డిగారి అనంతరం తన 21-వ ఏటనే శ్రీ వేణుగోపాలస్వామి ఆలయ ధర్మకర్తలై, 1935 సం॥ మొదలు 1960 వరకు మేనేజింగ్ట్రస్టీగాయుండి కీ॥ శే॥ లగువరకు ట్రస్టీగాయున్నారు. శ్రీ ఆనం వెంకటరెడ్డి (నరసారెడ్డిగారి కుమారులు), శ్రీ మన్నెం శ్రీనివాసులురెడ్డి, శ్రీ మజ్జిగ దశరథరామిరెడ్డి, శ్రీ తుమ్మల దశరథరామిరెడ్డి, ధర్మకర్తలగార్ల సహకారముతో ఆలయము నెల్లూరు మండలంలో ప్రథమ దేవస్థానముగా రూపొంధించిరి.

రెండులక్షల ధనముతో, ఆరు వివాహములు ఒకేదఫా జరుపుటకు ఆరు బ్లాకులుగా విభజించి, బ్రహ్మాండమైన సత్రము నిర్మించినారు. దేవస్థానపు ఆస్తి 200 యకరముల మెట్టభూమి 1 లక్ష రూపాయల విలువగల వస్తువాహనములు, 4 లక్షల రిజర్వుఫండు, 1 లక్ష రూపాయల ఆదాయం కలిగి, నిత్యకల్యాణములతో ప్రసిద్ధి చెందియున్నది. దీనిమేనేజరుగా యం. నరసింహారెడ్డిగారుయున్నారు.

## 1968 సెప్టెంబరు తే 20 ది సా॥ గం. 9 లకు
## స్మశానవేదికపై నాయకుల అశ్రుతర్పణ

భారత లోకసభాధ్యక్షులు ''నీలం'' పలికెను, చింతించి ॥
ముప్పదేండ్లు, మున్సిపాల్టీ నేలిన ముఖ్యుడు లేడనెనూ ॥
ఆంధ్ర ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి, కదలించె గుండెలనూ॥
చిన్ననాటి స్నేహితుని కోల్పోతినని, చింతించి వచియించె ॥
కేంద్రమంత్రి రఘునాధరెడ్డి ఘనకీర్తిగాను బలికె ॥
బోలాశంకరు డేసీ మనలను బాసిపోయెననెనూ

### ఆనాడు కవు లెలా వర్ణించారయాంటే ?

''మహాకవి'' మోచర్ల రామకృష్ణయ్య మౌనమోముతోను ॥
విక్రమపురోద్యతకిరీటశ్చక్రవర్తెళ్ళిపోయెననెనూ ॥
దీపాల పిచ్చయ్యశాస్త్రి పలికెనొక తేజస్సైన పలుకు ॥
విద్యుత్సదృశప్రభావ విశ్రుతు డేసీ వెళ్ళిపోయెననెను ॥
మరుపూరు కోదండరామిరెడ్డానాడు మౌనముగాబలికె ॥
మానవత్వసూత్రాన్నందిచ్చిన మహనీయుడులేడా?నెనూ ॥
రేబాల దమయంతిదేవి చెప్పెనొక దివ్యమైనపలుకు ॥
''అమృత''మూర్తిని శోకతప్తతో అందించె బాష్పాంజలి ॥
కరిగెపోయె ''తెలుగు'' కప్పురమ్మనె కవి శివారెడ్డి ॥
నాడొక్క గేయమ్మున యేడ్పించెను నారపరెడ్డేమో ॥
అరిగె ''ఆశాజ్యోతి'' అమరపురికనే ఆనాడు, వచ్చారి ॥

రచయిత.

# ఏ. సి. రెడ్డి చరిత్ర

—౦—

<u>గమనిక :</u>

కథ - వంత - హాస్య - అన్నచోట్ల

కథకుడు - వంతకాడు - హాస్యకాడు అని భావించేది.

## వైతాళికా గీతం



అమ్మా! భారతీ సుగుణాంబ వేడెద వినవమ్మా భారతి
కొమ్మా. సింహపురి అమ్మాపుత్రుడైన సమ్మానానుడు
ఏ.సి. చరిత. చెప్పెద వినవమ్మా భారతి ॥అ॥
ఆంధ్రదేశమూన అవతరించినట్టి ఆనం వంశజాని, ఆదర్శ
చరిత. వినవమ్మా భారతి ॥అ॥
మూడుదశాబ్దమూలు మునిసిపాల్టీనేలి అన్ని మునిసిపాల్టీల
కాదర్శ ఛేర్మెన్ చరిత వినవమ్మా భారతి ॥అ॥
మంత్రివర్గమందు ముమ్మారు వెలుగొంది సంకటములనైనా
సరకుచేయని ఏ. సి. చరిత వినవమ్మా భారతి ॥అ॥

# కథా ప్రారంభం

వంత:— భారతదేశము ప్రపంచదేశములకు పేరుతెచ్చినదని చెప్పుచున్నారే! భారతదేశములో జన్మించిన నాయకులను, భారత దేశాన్ని గురించి సెలవిస్తారా?

కథ:- అదే చెప్తున్నాను వినండి,

( వినరా భారత వీరకుమార - వర్ణన)

అన్ని దేశముల పేరు తెచ్చినది భారతదేశమ్మ ॥తం॥
నీతి నియమముల పుట్టినిల్లు మన భారతదేశంబు ॥తం॥
ఆ దేశంబున జననం బందిరి అద్వితీయమతులు ॥తం॥
మహాత్మగాంధీ జన్మించినదీ మహనీయ దేశంబు ॥తం॥
రాజర్షి రాజేంద్రప్రసాదు రంజిల్లిన దేశమురా ॥తం॥
వీరుడైన నేతాజీ పుట్టిన వీర దేశమండి ॥తం॥
హిందూముస్లిం ఏకమన్నదీ అజాదు దేశంబు ॥తం॥
అహింస కెప్పుడు పుట్టినిల్లు మన భారతదేశంబు ॥తం॥
ఆ దేశములో పేరుగాంచినవి ఆంధ్రప్రదేశంబు ॥తం॥

వంత:— అయితే ఆంధ్రప్రదేశ్‌లో ఎవరైన మహనీయవ్యక్తులు జన్మించారా?

కథ:— ఎందుకులేరు వున్నారు విను.

— రగడ —

దేశోద్ధారక నాగేశ్వరరావు తందానా భాయి తానెతందన
దేశభక్త కొండ వెంకటప్పయ్య ॥తం॥

భోగరాజు పట్టాభిగారు ||తం||
ఆంధ్రకేసరి ప్రకాశంగారు ||తం||
అమరజీవి పొట్టి శ్రీరాములుగారు ||తం||
అమరిన దేశము మనదయ్యా అన్నపూర్ణయై యుందయ్యా!
తాధిమి! తకధిమిధా||

వంత:- అయితే, అన్నీ చెపుతున్నావుగాని యిప్పుడు నీవు చెప్ప బోయే కథ యేమిటో సెలవిస్తారా ?

— పద్యం —

అనాథులకు పట్టెడన్నము వేయు న
టంచు ఆంధ్రప్రదేశమే అవతరించె.
అట్టి దేశానికే పేరు తెచ్చినట్టి ఏ. సి.
చరితంబు చెప్పెద విపులముగను.

హాస్య:- ఓ. హో, హో. ఏ. సి. సుబ్బారెడ్డిగారి గాథ చెప్ప బోతున్నారన్న మాట! ఏదీ చెప్పండి. ఆ మహనీయుని చరిత్ర వినాలని మాకూ కుతూహలముగా వున్నది.

— రగడ —

శ్రీమన్మహామహుడు చెంచుసుబ్బారెడ్డి చరితమువినరయ్యా
తందానతాన.
సిరి వెలసిల్లిన సింహపురమ్మున సింహకిశోరమ్మ ||తం||
పందొమ్మిదొందల ఆరునపుట్టిన పురుషసింహుడండీ ||తం||

రైతుకుటుంబమునందుదయించిన రత్నము మన ఏ.సి. ॥తం॥
రాజనరేంద్రుని పట్టణమందున రమ్యముగాపుట్టె ॥తం॥
పోలీసాఫీసరు పుత్రుడై పుట్టెను పౌరజనుడు ఏ. సి. ॥తం॥

హాస్య:- రాజనరేంద్రుని పట్టణమన్నారే; అది ఏపూరు ఏ. సి. గారు నెల్లూరులోకాదా పుట్టినది.

కథ:- కాదు వారి తండ్రిగారు పోలీసు ఆఫీసరుగా రాజమండ్రిలో యుండగా ఏ. సి. జన్మించారయ్యా!

వంత:- తండ్రి పేరేమిటన్నారు ?

— రగడ —

తండ్రి సుబ్బరామిరెడ్డి, తల్లి నారాయణమ్మ ॥తం॥
ఆ సుగుణాత్ముల సుపుత్రుడయ్యా, సుందరుండు ఏ.సి. ॥తం॥
ఆ స్వము వంశపు ఆణిముత్యము ఆర్యుడు మన ఏ. సి. ॥తం॥
అమిత తేజశ్శాలౌనని చెప్పిరి అచ్చటి పండితులు ॥తం॥

కథ:— అచ్చట జ్యోస్యులు ఆంధ్రరాష్ట్రానికే కీర్తిప్రతిష్టలు తెచ్చే కొమారుడు మీకు కలిగారని వారి జాతకఫలాన్నిబట్టి ఏ. సి. తండ్రిగారికి చెప్పారు.

వంత:— అచ్చట ఏ. సి. గారేవిధంగా పెరిగారో చెప్పగలరా?

— రగడ —

బాలచంద్రుడై దినదినానికి పెరిగెను మన ఏ. సి. ॥తం॥
చిరునవ్వులతో చిందులాడుచూ స్నేహితులనుగూడె ॥తం॥

— పద్యం —

జాతకంబునుజూచి చెంచుసుబ్బారెడ్డి
యనెడి పేరు పెట్టిరి మన ప్రియతమునకు
ముద్దుగాపిలిచిరి మన ఏ. సి. రెడ్డిని
రామచంద్రుని రామాయనినయట్లు.

హాస్య:— ఏ. సి. అని చిన్న పేరుతో పిలుస్తారేమిటాని నా సందేహం!

కథ:— పెద్దవారు కావలసినవారిని ఎవరినైనా అలాగే పిలుస్తారని తెలియదా?

వంత:— తెలియదు చెప్పండి.

కథ:— రామచంద్రుని రామా అన్నారు. మోహన్‌దాస్‌కరంచంద్‌గాంధీగారిని గాంధి అని పిలిచారు. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారిని నెహ్రూ అన్నారు. అలానే మన ఆనం చెంచుసుబ్బారెడ్డి గారిని ఏ. సి. అని ముద్దుగా పిలిచారు. నాయకునిపేరుగా నిలిచిపోయింది.

వంత:— అదా విషయం. యిప్పుడు పూర్తిగా తెలిసినది. అయితే వీరిచదువులు ఎచ్చట చదివించారండి.

కథ:— ఏ. సి. గారికి చదువుకొనే ప్రాయము రాగానే నెల్లూరులో చేరారు వారి తండ్రిగారు. చదువు పారంభించారు ఏ. సి.

— రగడ —

తెలుగుచదువులో చేర్పించారు సింహపురమునందె ||తం||
వరుసగ చదివెను గురువులుచెప్పెడి వరుసచదువులన్ని ||తం||
తప్పినపాఠము ఒప్పజెప్పుటకు తరుణాము లేపసునూ ||తం||

హాస్య:— యీరోజు తప్పిపోయిన పాఠాన్ని రేపు పూర్తిగా ఒప్పజెప్పేవారా!

కథ:— అపుడు ఈవిధంగా నెల్లూరు చదువులు తన పన్నెండవ యేటకే పూర్తిచేసిరి.

హాస్య:— అపైె చదువుకు ఎచ్చట చేర్చారు ?

— రగడ —

బాల్యచదువులు బాగుగనేర్చెను
||తంతానాబాయి తానె తందనా||
మదరాసుపట్టణమందునజేరెను ||తం||
టౌజర్లేసెను టైయ్యులుగట్టెను |తం||
పచ్చియప్పకాలేజిలో చేరెను ||తం||
కాసురెడ్డితో కలిసిచదివెనయ్యా! ||తం||
తందానా బాయి తానెడందనాన||

పంత:— అయితే యిప్పటిమాదిరి పంచలుగట్టి లాగులు వేసేవారు కాదన్నమాట!

కథ:— కాదు. అప్పుడు చదువుకొనేరోజులు, అందులో ఇంగ్లీషు చదువులు. పుల్‌టౌజర్లు వేసి షర్టులపై కోట్లువేసి, టైగట్టి మేజోళ్ళు బూట్లు వేసి మద్రాసులో శ్రీ ఏ. సి. రెడ్డిగారు కాలేజిపోతూయుంటే ఒక జమీందారుగారి అబ్బాయా! అనిపించేది.

హాస్య:— కాసురెడ్డితో కలసి చదివారన్నారె వారెవరండి?
కథ:— వారేనయ్యా! యిప్పటి ముఖ్యమంత్రి (1968) బ్రహ్మానంద రెడ్డి
పంత:— యింకా యెవరితోకలసి చదివారండి సుబ్బారెడ్డిగారు?

— రగడ —

ఆర్. డి. ఆర్‌తో అప్పుడు చదివెనూ ||తం||
ఆనందముతో చదువుచుండెను ||తం||

వంత:— ఆర్. డి. యార్ అన్నారే వారెవరండి ?

కథ:— వారే! మన రేబాల దశరథరామిరెడ్డిగారు.

వంత:— దశరథరామిరెడ్డిగారున్నూ వీరితో మద్రాసులో చదివారా !

కథ:— అవును- యీవిధంగా మద్రాసులో చదువుకునే మూడవ సంవత్సరానికే (ఏ. సి.) 15వ యేట నీకు వివాహం చేస్తామన్నారు పెద్దలు- నాకేమిటి వివాహమన్నారు ఏ. సి. గారు.

హాస్య:— కళ్యాణమొస్తె కంజాక్షుడున్ను తప్పించుకోలేడుగదా! అది నిజమే, ఆవిధంగానే జరిగింది.ఏ. సి. గారి పెండ్లి.

— రగడ —

అన్నపూర్ణమ్మకు ఆనమయ్యకు అప్పుడుజరిగె పెండ్లి ||తం||
చిన్నతనంబున చేసిరిపెండ్లి చిలుకగోరింకలకు ||తం||
తొమ్మిదివత్సరముల బాల తొట్రుపడుచునుండె ||తం||
ఆదినములలో జరిగెడిపెండ్లి అంతా ఆవిధమే ||తం||

హాస్య:— అయితే మన ఏ. సి. రెడ్డిగారి వివాహము అయిన తర్వాత మద్రాస్ చదువుకు మరలాపోయారా ?

వంత:— పోయారు- చదువు మానుకుంటారా! మహనీయులు !

— రగడ —

మద్రాస్ చదువుకు మరలాపోయెను మహానీయుడు ఏ.సి. ॥తం॥
చదువును చకచక సాగించారు సమయస్ఫూర్తిగను ॥తం॥
ప్రతిఏడును ఒకతరగతి పెరిగెను ఫస్ట్‌క్లాస్‌నందు ॥తం॥
ఈవిధిచదివెను ఇంగ్లీష్‌చదువును విడువక మన ఏ.సి. ॥తం॥

కథ:— ఈవిధంగా మద్రాసులో ప్రతిసంవత్సరము తప్పిపోకుండా చదువుతున్నాడండీ శ్రీ ఏ. సి. గారు.

వంత:— యిట్లా ఎన్నిసంవత్సరాలు చదివారు మద్రాసులో ?

కథ:— ఎనిమిది సంవత్సరాలు నిరాటంకంగా చదివి తన 20వ యేట — 1927 వ సంవత్సరమునకు.

— రగడ —

కాలేజిచదువులు ఖ్యాతిగ చదివెను ॥తం॥బా॥ తాన॥ తం॥
గాంధి పిలుపుతో కదలి వచ్చెను ॥తం॥
ఇంగ్లీష్ చదువులు విడనాడి వచ్చెను ॥తం॥
స్వాతంత్ర్యపు పోరాటమునందున ॥తం॥
సానుభూతిపరు లెందరోగూడగ ॥తం॥
స్వాతంత్ర్యయోధుల సరసనచేరారు ॥తం॥
స్వాతంత్ర్య భీషణ సమరము నడిపారు ॥తాధిమి॥తకధిమిత॥

హాస్య:— ఇంగ్లీషు చదువులు పెద్దగా చదివి పెద్ద ఆఫీసర్ పదవి చేస్తారుకదా! అని తలచుకొంటే చదువు పూర్తిగా మానేశారా ?

వంత:_ యేవిధంగాయున్నది ?

— రగడ —

గాంధీగారిపిలుపన్ననూ ||సై||
కదలివచ్చె లోకమ్మెల్లనూ ||సై||
విద్యార్థిలోకమ్మెల్లనూ ||సై||
వెడలెను స్వాతంత్ర్యమ్మంచూ ||భళానోయిబాయిభళి
తమ్ముడా||

కథ:_ స్వాతంత్ర్య పోరాటములో మహానాయకులతోటి ముందుకు ఉరుకుతూన్న వి.సి. గారికి పిడుగువంటివార్త వినిపించినది !

వంత:_ యేమిటి ! అశుభమా ?

కథ:_ అవును - 1928 జూలై 14 తేది తన తండ్రిగారైన సుబ్బరామరెడ్డిగారి మరణవార్త వినగానే దుఃఖాతిశయులై యేవిధంగా దుఃఖిస్తున్నారనూంటే !

వంత:_ యేవిధంగా ?

— రగడ —

పసివారిని మము వీడిపోతివా పెద్దలెవరు తండ్రీ ||తం||
యింతలోనె మము వీడిపోతువని అనుకోనమోతండ్రీ ||తం||
పెద్దచిన్నల భారము మాపై మోపినావతండ్రీ ||తం||
నీదుచాటు బిడ్డలుగా బ్రతుకనోచలేదుతండ్రీ ||తం||

కథ:— దుఃఖాన్ని పట్టలేనివారై తండ్రిగారి ఆత్మశాంతికై దహనసంస్కార విధులు సక్రమంగా అన్నగారైన రంగారెడ్డిగారితో నెరవేర్చి దశాహస్సు కర్మలను పూర్తిచేసినవారై-యీవిధంగా తండ్రిగారి మరణదుఃఖముతో కొంతకాలమున్న శ్రీ ఏ. సి.

వంత:— యేమిచేశారండీ ?

కథ:— నెల్లూరు మూలప్పేటలో వేంచేసిన శ్రీ వేణుగోపాల స్వామివారి వేడుకలు చూసేందుకు వెళ్లేరు.

హాస్య:— అచ్చట వేణుగోపాలస్వామి దర్శన మేవిధంగా జరిగిందో చెప్పగలరా ?

కథ:— చెబుతా వినండి.

— ర గ డ —

మూలప్పేటలో వేంచేసియున్న ముఖ్యమైన స్వామి ॥తం॥
వేణుగోపాలుని వేడుకచూడగ వెళ్లెను మన ఏ. సి. ॥తం॥
ఆగోపాలుని పూజలుచేసి అరుగుదెంచె ఏ. సి. ॥తం॥
స్వప్నావస్థలో స్వగతముపలికెను స్వామి పలుకటంచు ॥తం॥
ధర్మకర్తృత్వము నెరవేర్చుమని దైవపిలుపటంచు ॥తం॥
ఏ. సి. రెడ్డి ఆలోచించెను ఆరోజంతయును ॥తం॥

కథ— దైవము కలలో కనుపించి తన దేవస్థానవు పెత్తనము చేయమని ఆదేశించారు.

వంత:— అంతవరకు యేపదవి చేయలేదేమోనే ?

కథ:— చేయలేదు. ప్రప్రథమంగా శ్రీ వేణుగోపాలస్వామి వారి దేవస్థానానికే మేనేజింగ్ ట్రస్టీగా చేరారు.

పంత:— 1934 సంవత్సరము, నెల్లూరు సెంట్రల్ కో-ఆప రేటివ్ బ్యాంకు ఎన్నిక జరిగింది. ఏ. సి. రెడ్డి అనుయాయులే డైర క్టర్లుగా వచ్చారు —

హాస్య:— ఏ. సి. అధ్యక్షులయ్యారా ?

కథ:— లేదు. తన సహపాఠి, శ్రీ రేబాల దశరథరామరెడ్డి గారిని, బ్యాంకు అధ్యక్షులుగా యేకగ్రీవ ఎన్నిక చేయించారు.

హాస్య:— 1936 సం॥లో తాలూకబోర్డు ఎన్నిక జరిగినదికదా! దానికెవరండీ అధ్యక్షులు ?

— రగడ —

తాలూక బోర్డుకు జరిగిన ఎన్నిక తదనంతరమ్మున ॥తం॥
ఏ. సి. గారిని అధ్యక్షులుగా యెన్నుకొనిరి వారు ॥తం॥
బోర్డుపనులు తనపనులే యనుకొనిచూచెను మన ఏ.సి. ॥తం॥
అందరిసభ్యుల అభిమానమును అందుకొందె ఏ.సి. ॥తం॥

కథ:— అతి చాకచక్యముగా తాలూకా బోర్డును నిర్వర్తి స్తున్న ఏ.సి.గారు స్వాతంత్ర్యపోరాటముల్లో పాల్గొనవలసివచ్చినది.

పంత:— కాంగ్రెస్ పోరాటాలు యేవిధంగా జరిగెనో చెప్పండి.

కాంగ్రెస్ పోరాటమందున ॥సై॥
ఘనతవహించిన పెద్దలూ ॥సై॥

నడుముగట్టి ముందుకొచ్చిరి ||సై||
నాణ్యతెరిగి పోరాడారు ||భళానోయిభళె||

ఈ విధంగా కాంగ్రెస్ పోరాటాలు 1937 లో జరుగుచున్న సమయములోనే మునిసిపల్ ఎన్నికలు జరుగనున్నవని ప్రకటించారు ప్రభుత్వమువారు.

హాస్య:— అయితే మన ఏ.సి.గారు అఎన్నికల్లోపాల్గొన్నారా?

కథ:— వారు పాల్గొనడమేగాక వారి మిత్రులందరుగూడా కాంగ్రెస్ తరపున కౌన్సిలర్లుగా నిలిపారు. అప్పుడు నెల్లూరు టౌన్‌లో ఏ. సి. గారినిగురించి ప్రతి వార్డులో యేవిధంగా చెప్పుకొనుచున్నారయా అంటే.

హాస్య:— యెట్లానో చెప్పండి.

— రగడ —

కులమతంబుల ఏకముజేసిన గుణవంతుడు ఏ. సి. ||తం||
పంటపాకనాడొక్కటిజేసిన ప్రతిభవంతుడండీ ||తం||
ద్విజులన్నను నాప్రాణంబనియెను దీర్ఘదృష్టి ఏ. సి. ||తం||
వైశ్యులన్న నావెన్నముకనెను, వాదికాని ఏ. సి. ||తం||
చేనేతన్నను సగమునేనని చెప్పెను మన ఏ. సి. ||తం||

హాస్య:— అగు-కులమతాలు యేకముచేసారన్నావు: బ్రాహ్మల మాట చెప్పావు. వైశ్యులవిషయం చెప్పావు. చేనేతవారి సంగతిన్నీ చెప్పావు కానీ; మా ముస్లింలమాటి చెప్పలేదే ?

కథ:— నేను చెప్పబోతున్నాను. యింతలో నీవు, ఆగు అని చెప్పావు చెబుతా విను —

— రగడ —

ముస్లింలను తన సోదరులగనుచూచును మన ఏ. సి. ॥తం॥
మేదర, కుమ్మర, చాకల, జంగము-సకలకులమ్ములను ॥తం॥
ఆదరణతో నా మిత్రులేయని అనుకుండును ఏ. సి. ॥తం॥
హరిజనులకును ఆప్తమిత్రులుగ అగుపడు మన ఏ.సి. ॥తం॥

హాస్య:— అన్ని కులములవారు ఏ. సి. గారికి అనుకూలురని చెప్పావే! అన్ని పార్టీలవారు యేవిధంగాయుంటారో చెప్పలేదే?

కథ:— అది అడగవలసిన విషయమే. అడిగావు! చెబుతున్నా విను—

— రగడ —

కాంగ్రెస్ వారు ఏ. సి. అంటే కనికరముతోనుంద్రు ॥తం॥
కమ్యూనిస్టులు ఏ. సి. నీతిని కాదని చెప్పరుగా ॥తం॥

హాస్య:— అన్ని పార్టీలున్నూ ఏ. సి. గారికి అనుకూలమేనన్న మాట. కాబట్టే వారునిలిపిన కౌన్సిలర్లు అందరూ గెలిచారు. అందరూ వీరి కౌన్సిలర్లు గెలిస్తే చైర్మన్‌గా నీవు పోటీచేయవద్దని ఆంధ్ర కాంగ్రెస్‌వారు, ఆదేశమిచ్చారటనే. అది నిజమేనా?

కథ:— ఇచ్చారు. నిజమే.

హాంత:— అందుకు మన ఏ. సి. గారు అంగీకరించారా?

కథ:— ఎట్లా అంగీకరిస్తారు, చెప్పండి ? నెల్లూరు మున్సిపల్ కౌన్సిలర్లు అందరూ చేరి 1937 ఫిబ్రవరి 8-వ తేది చైర్మన్ సుబ్బారెడ్డిగారిని వుండమని యేకగ్రీవముగ తీర్మానించారు.

వంత:— అప్పుడు వైస్‌చైర్మన్ ఎవరండీ ?

కథ:— ముంగమూరు విశ్వనాథరావు.

హాస్య:— ఈవిధంగా యేకగ్రీవంగా యెన్నుకొన్న అధికార పార్టీ ముందు నెల్లూరుకు యేమి సౌకర్యాలు చేశారో చెప్పగలరా ?

కథ:— చెపుతా విను —

— రగడ —

మునిసిపాలిటిలో, ముందుగ చూచెను ||తం

మురికివాడలకు, మంచి సౌకర్యము ||తం

వాడవాడలకు, వరుసగ చేసెను ||తం

సిమెంటురోడ్లులు సిద్ధముజేసెను ||తం

నీటికొళాయిలు, నింపుగవేసెను ||తం

పాయిఖానాలు, పదిలపరచెను ||తం

పేదసాదల బాగేకోరెను ||తం

పేదలపాలిటి పెన్నిధి అనిరయ్యా ||తాథిమి. తక థిమిథా

హాస్య:— ఏమండోయ్ ! వారు చైర్మన్ అయినతర్వాత కొన్ని యిళ్ళకు పన్నులు తీసివేశారటనే ! ఆవిషయమేమీ చెప్పలేదే ?

కథ:— చెప్పుతున్నా విను.

— రగడ —

దూలమ్ముల్లు లేనిళ్ళకు వొల్లను తం॥ ఖాయి॥ తానెతందన।
తీసివేసిరి పన్నులన్నియును ॥తం॥
ఏ.సి. రెడ్డికి 'జై' అనిచెప్పిరి అప్పుడు ప్రజలంతా
॥తం। ఖాయి॥

హాస్యః— అంతా పేదలకు సహాయము చేసారని చెప్పారే! యితరులు, యేమైనా చెప్పకొంటే అదరించేవారా?

కథః— వీరు, వారు అనే తారతమ్యము వారిలో యెవ్వడూ లేదు. వారి గుణగణాలు చెబుతా విను.

— పద్యం —

అడిగినదె తడవుగ, అభయమిచ్చు
పరమశివుని పగిది, ఏ. సి. యన్నంతనే!
వెనుకటి చరిత, వినక, పగతుడైనను,
దరిజేర్చు, ప్రఖ్యాతగుణుడు ఏ. సి.

— రగడ —

అన్ని పార్టిలను, ఆదరంబున అప్పుడుజూచు ఏ. సి. ॥తం॥
వ్యతిరేకులు నాకొక్కరులేరని అనుచునుండు ఏ. సి. ॥తం॥
పురపాలనము, పౌరులసొత్తని పలుకుచుండు ఏ. సి. ॥తం॥
నాపౌరులు, యేపని చెప్పిన నాదేలను ఏ. సి. ॥తం॥

కథ:— ఈవిధంగా నగరపాలనము చేయుచున్న వి. సి. గారి ప్రజలు ఏపని చెప్పుడురా! అని, ఆ పనినియంతయు తనదిగా భావిం చేయుచున్నారయ్యా!

వంత:— ఆవిధంగా చేస్తూయుంటే, ఎట్లు మరచిపోగలర వి. సి. గారిని.

కథ:— అదే వారిలో వున్న ప్రత్యేకత. యెన్ని సంస్థల నాయకత్వము ఎన్నిదఫాలునెరవేర్చినను కాదనలేక పోయారు ప్రజలు

హాస్య:— ఇంకా ముఖ్యమైనపనులు యేమిచేశారో చెప్పండి.

కథ:— ఆంధ్రరాష్ట్రములోనే యెచ్చట అప్పటికి లేని ఘనమై పని ఒకటి చేయించారు మన మున్సిపాల్టీలో.

వంత:— తెలియదె! చెప్పండి.

— రగడ —

హరిజనహాస్టలు అంతవరకు మన ఆంధ్రకులేదండి ॥తం
హాస్టలుస్థలముకు అన్నిచోట్ల తిరిగరసినచ్చినారు ॥తం
హరిజననాయకు లందరువచ్చి అర్థించారప్పుడు ॥తం
వేములకూర్మయ్య వెనుకటిమంత్రులు ఎందరోవచ్చారు॥తం
అన్నినగరములు తిరిగి వేసారితి మన్నారు వారు ॥తం
మీానగరమ్మున స్థలమిప్పించిన నిలిపెదమన్నారు ॥తం

హాస్య:— అంతవరకు యేమున్సిపాల్టికూడ హరిజన హాస్టలుకు స్థలమివ్వలేదన్న మాట!

కథ:— ఇవ్వలేదు. మన చైర్మెన్‌గారు యెచ్చట బాగావుం డునా అని తన సహాచర మిత్రులతో ఆలోచించి బోస్ విగ్రహానికి ప్రక్కనున్న స్థలాన్ని యివ్వడానికి నిశ్చయించుకున్నారు.

వంత:— ఆదేనా యిప్పుడు యేనుగు పట్టాభిరామిరెడ్డి అధ్వర్య ములో పూటకు 1200 మంది బాలురకు భోజనవసతులు యిచ్చు చున్నది.

కథ:— అవును ఆదే - యీవిధంగా మునిసిపల్ చరిత్రలో ముఖ్యాతిముఖ్యమైన పనులు నెరవేర్చుచున్న సమయంలో

హాస్య:— మరలా యేమి సమస్య వచ్చిందండీ, పూర్తిగాక ముందే నిలిపారు —

కథ:— ఇదే గొప్పసమస్య. చెప్పుటకు అలవిగాని దేశసమస్య 1942, ఆగస్టు (క్విట్ ఇండియా) ఉద్యమం.

హాస్య:— మూడవ సంవత్సరము జరుగవలసిన మునిసిపల్ ఎన్నికలు జరుగలేదా ?

కథ:— జరుగలేదు. రెండవ ప్రపంచయుద్ధకారణంగా అన్ని ఎన్నికలు ఆపుచేయించారు బ్రిటిష్ గవర్నమెంటువారు.

వంత:— అప్పుడు మన నాయకులంతా బయలుదేరారా ?

కథ:— బయలుదేరారు. మన ఏ. సి. గారు పురపాలకసంఘా నికి రాజీనామాజేసి, యేవిధంగా బయలుదేరారయ్యాంటే,

వంత:— ఏవిధంగా ...

— రగడ —

నలువది రెండు ఆగష్టునందున ||తం|| ధా||
నగరపాలనము నాకొద్దంటూ ||తం||
నాడేయిచ్చెను రాజీనామా ||తం||
సింహామండలికి చైతన్యండెయ్యా
సహాచరులందరు సానుభూతిజూప ||తాధిమి. తక ధిమిధా||
నాయకత్వముకు నడుముగట్టెను ||తం||
నాయకులందరు 'సై' యనంగను ||తం||
నగరమంత వక్కెత్తుకు దెచ్చిరి ||తం||
నాయకాగ్ర నాయకులు మెచ్చగ ||తం||
సింహ్మామండలికె, చైతన్యండయ్యె. ||తం||
సహాచరులందరు సానుభూతిజూప ||తాధిమిత|| ధా||

హాస్య:— ఇవ్విధంగా తన సహచరమిత్రులంతా కలసిరాగా యింకా యేవిధంగా విజృంభించారయ్యా —

— రగడ —

సింహాపురి కిశోరాలు ||సై||
మధ్య పాన గిడ్డంగులూ ||సై||
మట్టిపాలుగావించిరీ ||సై||
మమతలుజూపుచు మిత్రులు ||సై||
మన ఎ. సి. తోనే తిరిగేరూ ||భలానోయి||

రైలుస్టేషనులందునా ||సై||
రైళ్ళన్ని ఆపించారు ||సై||
రైతులంత కలసి రాగనూ ||సై||
రైతుబిడ్డ హుంకరించేనూ ||భలానోయి||

పంత:_ ఈ ప్రకారము సత్యాగ్రహాలు, సహాయనిరాకరణోద్యమం, క్విట్ ఇండియా ఉద్యమాలు జరిపించుచున్న ఏ. సి. బైట వుంటే మన ప్రభుత్వం సాఫీగా జరుగదని ఆలోచించిన తెల్లదొరలు యేమిచేశారంటే!

వంత:_ యేమిచేశారు ?

— రగడ —

అరెస్టు ఆర్డరు తెచ్చి అధికార్లు, అనుమతినేడారు ||తం||
జైలుశిక్షకె సిద్ధమాయనని జరిపెను పికెటింగు ||తం||
యెంత చెప్పినా, వినువాడు కాదని, వేసిరి బేడీలు ||తం||

కథ:_ నెల్లూరు నగరాన్ని! యేకఛత్రాధిపతిగా యేలిన, నగరపాలకుని ఆనగరవీధుల్లోనే అరెస్టుజేసి తీసుకొనిపోయారు!

హాస్య:_ అప్పుడు కోర్టులో విచారణ జరిపించారా ?

కథ:_ యేమి విచారణలేండి, బ్రిటిష్ గవర్నమెంటువారు వియరొక్కన్నారనే నెపముంచి, యేకపక్షముగా విచారణ జరిపి, ఆరు నెలలు కఠినశిక్ష విధించిన కోర్టువారు వెంటనే రాయవేలూరు జైలుకంపేరు.

వంత:— ఏ. సి. గారు, రాజీనామా యిచ్చిన తర్వాత పురపాలక సంఘానికి మరలా అధ్యక్షున్ని ఎన్నుకొనలేదా ?

కథ:— ఎన్నుకొనే అవకాశము లేదుగాని అపద్ధర్మ చైర్మన్‌గా వుండమని కోరారు, గవర్నమెంటువారు.

వంత:— యెవరిని ?

కథ:— శ్రీ .రేబాల లక్ష్మీనరసారెడ్డిగారిని; అనాధగాయున్న పురపాలకసంఘానికి అపద్ధర్మచైర్మన్‌గా యుండి ఆలోటును తీర్చారు అర్. యల్. రెడ్డిగారు.

హాస్య:— ఏ. సి. రెడ్డిగారి జైలుశిక్ష యేవిధంగా జరిగిందో కొద్దిగానైనా చెప్పండి.

కథ:— ఆరుమాసములు జైలుజీవితము అనేకవిధములైన కష్టములకోర్చి గడ్డము పెంచుకొని వచ్చిన ఏ. సి. గారిని చూచి మన ఏ. సి. సుబ్బారెడ్డిగారేనా? అని నివ్వెరపోయారు ప్రజలు.

వంత:— ఆరునెల్లు పూర్తయి వచ్చారన్నమాట !

కథ:— శిక్షాకాలము పూర్తిఅయి తిరిగివచ్చిన ఏ. సి. గారిని అన్ని సంఘాల తరపున సభలు, సమావేశాలు జరిపి ఘనంగా సన్మానించారు. యీవిధంగా కొంతకాలము జరిగిన తర్వాత—

హాస్య:— మునిసిపల్ ఎన్నికలు వచ్చినవా ?

కథ;— అవును ! 1947 లో మరలా ఎన్నికలొచ్చాయి.

— రగడ —

ఏ. సి. రెడ్డి అనుయాయులందరు ఏర్పడియున్నారు ॥తం॥
ఏకపార్టీగా పోటీచేయుట కెపుడనియున్నారు ॥తం॥

మానాయకులు, మీరేయంచు మరిమరి చెప్పారు ॥తం॥
యీవిధి కోరిన, నాయకత్వముకు యేర్పడె మన ఏ.సి. ॥తం॥

వంత:— యెన్నికలు జరిగినతర్వాత మన ఏ. సి. సుబ్బారెడ్డి గారి సహచరులే వచ్చారా ?

కథ:— ఓ ఢంకా భజాయించి ఏ. సి. గారి అనుచరులే కౌన్సిలర్లుగా వచ్చారు. మరలా సుబ్బారెడ్డిగారినే 15—10—1949 లో చైర్మన్‌గా యెన్నుకున్నారు.

వంత:— అప్పుడు వైస్‌చైర్మన్ యెవరు ?

కథ:... పేరూరు లక్ష్మణగుప్తగారు.

1952 సం॥ భారత రిపబ్లిక్ ప్రథమ జనరల్ యెన్నికల్లో నెల్లూరు నియోజకవర్గంనుంచి పోటీచేసి ధనిక కుట్రదారులచే ఓడింపబడినా - అదే సంవత్సరం నవంబరు 10-వ తేది మునిసిపల్ ఎన్నికలలో చైర్మన్‌గా శ్రీ ఏ. సి. గారినే ఎన్నుకున్నారు. వైస్‌చైర్మన్‌గా యస్. మహబూబ్ ఖాన్‌గారిని ఎన్నుకున్నారు. ఈవిధంగా మునిసిపల్ ఎన్నికలు వస్తూనేయున్నవి. ఏ. సి. గారిని చైర్మన్‌గా ఎన్నుకొంటూనే యున్నారు.

వంత:— 1955 శాసనసభకు నెల్లూరు నియోజకవర్గమునకు ఏ. సి. గారు పోటీచేశారా ?

— రగడ —

నెల్లూరు శాసనసభ్యత్వానికి నిలచెను మన ఏ. సి. ॥తం॥
ఆపోటీలో అన్నివర్గములు ఆదరణముజూపె ॥తం॥

ఆసమయ్యాను అప్పుడు పంపిరి ఆంధ్ర అసెంబ్లీకి ॥తం॥
అంతా మనవారనుకొని చేసిరి అసెంబ్లి సభ్యునిగా ॥తం॥

కథ:— నెల్లూరు శాసనసభా నియోజకవర్గంనుంచి ఆంధ్ర అసెంబ్లీలో ప్రవేశించారు శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డిగారు.

హాస్య:— తిరుమల తిరుపతి దేవస్థానంబోర్డుకు అధ్యక్షులుగా వున్నారటనే ఆదెప్పుడు ?

కథ:— 1957 ఏప్రిల్ లో వున్నారు.

వంత:— ఆ దేవస్థాన మహిమ యేలాంటిదో కాస్తచెప్పగలరా?

కథ:— చెప్తా విను.

— ర గ డ —

యేడుకొండల వేంకటరమణుడు వెలగలిగినస్వామి ॥తం॥
ఆంధ్ర దేశమున అవతరించె మన అదృష్టముకొలది ॥తం॥
దేశ దేశముల పేరుబొందెను దివ్యతిరుపతెంచు ॥తం॥
ఆ పుణ్యస్థలమునకు అధ్యక్షులయ్యాను ఆసమయ్యనాడు ॥తం॥
దివ్యపురుషుని దేవస్థానపు ధర్మకర్తయయ్యె ॥తం॥

కథ:— యిప్పుడుముగా కలియుగవైకుంఠంబని పేరుబొందిన తిరుపతి దేవస్థానపుబోర్డు అధ్యక్షులుగా 3 సంవత్సరాలు అతి జాగ్రత్తగా పరిపాలన నెరవేర్చారు శ్రీ సుబ్బారెడ్డిగారు.

వంత:— మరలా మున్సిపల్ యెన్నికలు వచ్చాయా ?

కథ:__ 1959 లో వచ్చాయి. మరలా సుబ్బారెడ్డిగారి వర్గం వారే వచ్చారు కౌన్సిలర్లుగా. 1959 అక్టోబరు 12వ తేదీన ఏ.సి.గారిని మరలా చైర్మన్‌గా యెన్నుకున్నారు. వైస్‌చైర్మన్‌గా యస్. మహబూబ్‌ఖాన్‌గారు వున్నారు.

హాస్య:__ ఈలోగా నెల్లూరుకు పెద్దగాచేసిన పనులేమైనావుంటే చెప్పగలరా ?

కథ:__ చెవుతున్నా వినండి !

— రగడ —

డ్రయినేజిస్కీము తెచ్చియిచ్చిన ధర్మప్రభువులండి ||తం||
డెబ్బదిఆరులక్షలఖర్చుతో తెచ్చిరి ఆస్కీము ||తం||
సంజీవరెడ్డి మంత్రివర్గమే చేసెను సాయమ్ము ||తం||
దోమలబాధను తొలగించిరి మన దొడ్డరెడ్డి ఏ. సి. ||తం||
ఆపహాసియుని అద్భుతశక్తికి ఆనందించారు ||తం||
జై ఏ. సి. కి జై జై యంచు జై చెప్పారపుడు ||తం||

వంత:__ ఇంకా వారుచేసిన గొప్పపనులు ఏమైనా వున్నవా?

— రగడ —

వాటర్‌సప్లయి స్కీముదెచ్చిన వదాన్యుడయ్యా ఏ.సి. ||తం||
నలుబదిలక్షల ముప్పదివేలా స్కీము శాంక్షనయ్యే ||తం||
వచ్చినస్కీమును వాడవాడలకు వరుసగ పంచారు ||తం||
పేదసాదలను భేదముంచక పాలించిన ఘనుడు ||తం||

అజాతశత్రుండని పేరొందెను, ఆజానుబాహుండు ॥తం॥
విద్యుచ్ఛక్తిని వేయించారు విడువక పురమంతా ॥తం॥

కథ:— నెల్లూరు పురమునకు కావలసిన సకల సౌకర్యాలను సక్రమంగా చేయించారు ఏ. సి. గారు.

వంత:— ఇట్లు మునిసిపల్ చైర్మన్‌గా చేస్తూనే ఆంధ్రా కాంగ్రెస్‌లో ముఖ్యులుగా వున్నారటనే!

కథ:— అవును! ఆంధ్రప్రదేశ్ మార్కెటింగ్ ఫెడరేషన్ అధ్యక్షులుగా, శ్రీ ఏ. సి. గారు విదేశయాత్ర పోతూ ఢిల్లీ పాలం విమానాశ్రయంలో దిగి, నేరుగా రాజఘాట్ వెళ్ళారండీ!

హాస్య:— ఎందుకూ?

— పద్యం —

రాజఘాటునందు, రతనాలరానులౌ
భారతీ సుపుత్రుల సమాధులందు
పుష్పగుచ్ఛములుంచి పూజ్యులనుచు
ప్రణతులిడెనహో! మన ప్రియతముండు.

కథ:— విదేశయాత్ర పూర్తికాకముందే, వెంటనే రావలసిందిగా కోరుతూ "కేబుల్" పంపారు ఆంధ్రకాంగ్రెసువారు.

హాస్య:— అచ్చటకూడా ప్రధానపాత్ర నిర్వర్తించారా?

— రగడ —

ఆంధ్రకాంగ్రెసుపాధ్యక్షులుగ అనురెను మన ఏ. సి. ॥తం॥
అల్లూరుసత్యం అధ్యక్షులుగా, అప్పుడు వున్నారు ॥తం॥

ఆంధ్రముఖ్యమంత్రైనరనివచ్చెను అందరున్నసభలో ॥తం॥
సత్యనారాయణరాజుండెదనని సభలోనే బలికె ॥తం॥
ఆంధ్రనాయకులు అందరు నిలిచిరి అందుకు పోటీగా ॥తం॥
తర్జన, భర్జన బయలుదేరె ఆ సమావేశమందు ॥తం॥
ఏ. సి. రెడ్డి చల్లనియోచన యేర్పాటుగజెప్పె ॥తం॥
హరిజనునొక్కని ముఖ్యమంత్రిగా అనుకొందామనేను ॥తం॥
సంజీవయ్య పేరుజెప్పెను, సంతసంబుతోను ॥తం॥
భారతదేశపు పుణ్యభూమికై, ప్రఖ్యాతిగనుండు ॥తం॥
ఇంతవరకు హరిజనప్రముఖుడు ఇండియాకులేడు ॥తం॥
అడ్డుచెప్పువారెవరు లేకనే ఆమోదించారు ॥తం॥

వంత:— అయితే సంజీవయ్య ముఖ్యమంత్రయ్యారా ?

కథ:— అయ్యారు - ఆ మంత్రివర్గంలో సుబ్బారెడ్డిగారిని మంత్రిగా చేరవలసిందిగా కోరినందువల్ల నెల్లూరు మునిసిపల్ చైర్మన్‌కు, తిరుపతి దేవస్థానపు బోర్డు అధ్యక్షతకును రాజీనామా ఇవ్వవలసి వచ్చినది.

వంత:— ఈ మంత్రివర్గపు గొడవకంటే ఆంధ్రా గవర్న మెంటును మించిన దేవస్థానపుబోర్డును విడిచి వెళ్ళడము ఎందుకూ అని ?

కథ:— అదా ! నీ సందేహం ?

హాస్య:— అదే నా సందేహముకూడాను ''ఒక్కసారి మంత్రి జెయ్యి గణనాథా నువ్వు ఓడకుంటె వట్టుబెట్టు గణనాథా'' అన్నారే ! ఎందుకా యీ మంత్రివర్గపు రభసా అని !

కథ:— ప్రజలసొమ్ము దుర్వినియోగంజేసి రెండవ పర్యాయం వస్తే నేమి, రాకపోతే నేమి ? అనుకొనే మంత్రులు ప్రజలనుంచి ఎన్నిక కాలేకపోతున్నారేమోగాని, నిష్కళంక పరిపాలకుల కొసం దేహం లేనే లేదు. ఎన్నిసార్లయినా పి. సి. గారు గెలిచితీరుతారు. దేవస్థానపు బోర్డు వదలి ప్రజామంత్రిగా ఎందుకు పోవలసివచ్చినదో యిప్పుడు చెపుతా విను —

— ర X డ —

మానవసేవయే మాధవసేవని మహాత్ముండు జెప్పె ॥తం॥
ఆనీతిని తాననుసరించెను ఆనమయ్యనాడు ॥తం॥

కథ:— మహాత్మాగాంధిగారు చెప్పిన ప్రకారం మాధవసేవ కంటే మానవసేవే ముఖ్యమనుకొన్నారు. పి. సి. గారు.

హాస్య:— మంత్రివర్గంలో చేరుతూ, మానవసేవ మానవసేవ అని మహా చెబుతావేమిటయ్యా —

కథ:— మంత్రివర్గప్రాతినిధ్యమంటే ముక్కోటి ప్రజానీకానికి నిష్కళంకంగా, కొంతమంది మంత్రులు ప్రజాసేవ చేసేవారుంటే మానవసేవ అనవలసిందేగదా !

హాస్య:— అవును అదీ నిజమే! సక్రమంగా చేయకపోతే మరలా అసెంబ్లీగేటు త్రొక్కలేరుగా !

కథ:— భారతదేశము మొత్తంమీద హరిజన ముఖ్యమంత్రిని చేసిన ఘనత ఒక్క ఆంధ్రరాష్ట్రానికే దక్కిందిగదా ! అట్టి ముఖ్యమంత్రిని వారి మంత్రివర్గములోని ముఖ్యులను సింహపురికి ఆహ్వా

నించి, ఘనముగా సన్మానించవలెననే కోరిక ఏ. సి. గారికి కలిగినది. అందుకు వారు అంగీకరించారు. ఫలాని తేదిన వస్తున్నామని చెప్పి పంపారు, నెల్లూరు పెద్దలకు.

హాస్య:— అపుడు నెల్లూరు ఎట్లాతయారయిందో చెప్పండి!

— రగడ —

చలువపందిరలు చక్కగ వేసిరి ॥తం॥
నెల్లూరు పట్నము నిండుగ వేసిరి ॥తం॥
వుల్లడీలు జాలర్లు గట్టిరి ॥తం॥
పుష్పులు కట్టని పందిరిలేదు ॥తం॥
విద్యుచ్ఛక్తిని ఇంపుగ వేసిరి ॥తం॥
రంగురంగు దీపాలంకారము రయముగ జేశారు ॥తం॥
మన ఏ. సి. గారు వస్తున్నారని మహానగరమంతా
॥తాధిమి తకధిమిథా॥

కథ:—ఈవిధం శోభాయమానంగా తీర్చిదిద్దారయ్యా నెల్లూరు పట్టణాన్ని.

వంత:— అప్పుడు తాలూకాలనుంచి, సమితులనుంచి వేడుకలతో వచ్చారటనే నిజమేనా?

కథ:— నిజమే! వారు ఏవిధంగా వచ్చారో చెపుతా

— రగడ —

అన్నిసమితులు ఆర్భాటముగా ఆరోజు వచ్చాయి ॥తం॥
ముఖ్యమైన వాద్యములన్నియు ముందుగనూ ర్చారు ॥తం॥

ఎన్ని వాహానపు వసతులున్నవో అన్ని యుపచ్చాయి ॥తం॥
మండలమ్మునవున్న వాద్యములు ముందుగవచ్చాయి ॥తం॥

వంత:— ఎవరెవరు నాయకులు వచ్చారో సెలవిస్తారా ?

— రగడ —

సత్యన్నారాయణరాజొచ్చారు, సంజీవయ్య వచ్చె ॥తం॥
ఏ. సి. సుబ్బారెడ్డి వెంటనేవచ్చెను వీరివెంటనుండి ॥తం॥

కథ:— ఈవచ్చిన నాయకులందరు ఆఉత్సవ పూలరథ ముపై ఆసీనులయ్యారు.

హాస్య:— వివిధమైన వేడుకలతో ఆ ఉత్సవం బయలు దేరిందో వివరిస్తారా ?

— రగడ —

వేడుక యింతని చెప్పెడుటకేమి అలవిగానిదండి ॥తం॥
జానపదమ్ములు 'జై' యని మ్రోగెను చెప్పరాని వేడ్క— ॥తం॥
కులుకుభజనలు, కూరిమివేసిరి కోరికున్నవారు ॥తం॥
చూచినతీరును ఆనాటివేడ్కలు చోద్యముగాయుండె ॥తం॥

వంత:— యింకా యేవిధంగా ఆ ఉత్సవ వేడుకలు జరిగినవో చెప్పగలరా ?

కథ:— మంగళతూర్యములు బాండుమేళమ్ములు, మేళవింప వివిధ వాద్యములతో అర్థశత శకటంబులపై ఉత్సాహపూరితులైన

యువకులు జానపద నాట్య కళానైపుణ్యములతో తాండవమాడుచున్న మహోత్సవము - ముఖ్య పురవీధులలో - వేంచేయుచున్న నాయకులపై - వేలకొలది పుష్పహారములు వేయుచుండగా - రూపాయల నోట్లతో హారములుకుట్టి ఏ. సి. రెడ్డిపై అభిమానముతో, నోట్లహారములు వేసినారు. సిరిగలిగిన సింహపురి చిన్నబజారు బంగారు నగల వర్తక ప్రముఖులు -

హాస్య:— నోట్లహారములా! అబ్బ! యింత పెద్ద సభవారున్నారే? నా మెడలో అలాటి నోట్లహారములు వేయకూడదా? అని నోరూరుచున్నది.

కథ:— నీకెవరేస్తారయ్యా - నీకే అలాంటివి ప్రాప్తిస్తే రెండవ వారి కంటపడకముందే మరుగునపడేవి.

హాస్య:— అయితే ఇలాంటివన్నీ పేదలసంస్థల కొస్తవన్నమాట

కథ:— కాకుంటే సొంతానికొస్థవనుకున్నావా? ఇదేమిటి ఏ. సి. గారికి రాజకీయబాధితులుగా యిచ్చిన భూమియావత్తూ కస్తూరిదేవి విద్యాలయానికి నిరుపేద బాలికలకు యిచ్చారు.

హాస్య:— తెలియదే ఆమాత్రం తెలిసియుంటే నేను కాళ్ళావేళ్ళాబడి కొంతన్నా తీసుకొనేవాణ్ణే.

కథ:— నీగొడవేగాని, అ ఉత్సవము ఏవిధంగా పరిసమాప్తయినది, అడగలేదుకదా?

కథ:— అపునౌను, ఆమాట మర్చాను చెప్పండి!

— రగడ —

ఆనాటిఘనతెను యీనాడు చెప్పను ఎవ్వరితరమౌను ॥తం॥
చూచినవారికి తెలియగవలెను చోద్యమైనవింత ॥తం॥
చెప్పనలవికానంత జరిగెను, శోభాయమానంబు ॥తం॥

కథ:— ఇట్లు చెప్పరానంత వేడుకతో తిరిగివచ్చిన నాయకుల మీటింగుకై వేచియున్న ప్రజాసమూహాన్నుద్దేశించి.

వంత:— వుద్దేశించి యేమన్నారు ?

— రగడ —

చలియలికట్టను తెంచుకవచ్చిన, సముద్రమన్నారు ॥తం॥
ఏ. సి. రెడ్డిని యెరిగున్నవారు యెందరో వచ్చారు ॥తం॥

కథ:— ఆ జనప్రవాహాన్నిచూచి ఆంధ్రముఖ్యమంత్రి ""ఆనందానంద కందళిత హృదయారవిందమైనది'' నా హృదయమన్నారు. సహజకవితాధోరణితో సంజీవయ్యగారు.

వంత:— సత్యన్నారాయణరాజు ఏమన్నారు ?

కథ:— ఈసత్కారమంతా ఏ. సి. గారివల్ల జరిగినట్లేనని చెప్పారు. ఏ. సి. గారి వందనసమర్పణతో సభ ముగింపుచేశారు.

హాస్య:— తర్వాత రాజధాని పోయారా ?

కథ:— పోయారు - యీవిధంగా మంత్రివర్గము నిరాటంకముగా సాగిపోతున్న సమయములో —

హాస్య:— మరలా ఏమిటి అపారు ఆర్ద్రోక్తిలో !

కథ:— 1962 లో వచ్చే ఎన్నికలకు, ఎన్నికల సంఘాన్ని కాంగ్రెస్‌తరఫున ఎన్నుకోవలసియున్నది, అందులో తనవారికి తగు ప్రాతినిధ్యము యిమ్మన్నారు ఏ. సి.-మీకుమాత్రం యిస్తామన్నారు అధికారములో వున్నవారు.

వంత:— ఏ. సి. గారు వూరుకున్నారా ?

కథ:— వూరుకుంటారా ? పోటీకి దిగారు తనకు రావసిన సీట్లు సంపాదించుకున్నారు.

వంత:— ముఖ్యమంత్రితో, కలతవస్తుందని తెలియదా ?

కథ:— తెలియకకాదు మిత్రమా ! మంత్రిత్వంపోయినా సరే మాటకొరకు పోరాడేవ్యక్తి శ్రీ ఏ. సి. గారు తన మంత్రిపదవికి రాజీనామా యిచ్చారు.

వంత:— 1962 జనరల్ ఎన్నికలలో ఎచ్చట నిలిచారు ఏ. సి. గారు ?

కథ:— రాపూరు నియోజకవర్గాన్నుంచి పోటీచేసి అత్యధిక మెజార్టీతో గెలుపొందారు.

హాస్య:— ఈతూరి నాయకత్వానికై యెవరు కృషిచేశారు ?

— రగడ —

సంజీవరెడ్డి ఏ. సి. రెడ్డిని చేరబిలిచినారు ||తం||
చిన్ననాటి స్నేహంబని చేతులుకలిపారు ||తం||
ఏ. సి. రెడ్డి అనుయాయులంతా ఏకంబయ్యారు ||తం||

సంజీవరెడ్డి నాయకత్వమును సర్వేకృష్ణులు జేసి ||తం

సంజీవరెడ్డినె ముఖ్యమంత్రిగా చేతామన్నారు ||తం

కథ.— ఇట్లు తన సన్నిహితులంతా కలసి నీలం సంజీవ గారినే ఆంధ్రా కాంగ్రెస్‌పార్టీ నాయకునిగా ఎన్నుకొన్నారు. ము మంత్రిగా వారినే వుండమని కోరారు.

వంత:— ఏ. సి. గారికి మంత్రిపదవి యిచ్చారా ?

కథ.— యివ్వటమేకాదు వారికి కావలసిన శాఖలు యి మంత్రిగాయుండవలసిందిగా సంజీవరెడ్డిగారు కోరారు. సంజీవ గారు రాజీనామా ఇచ్చిన తర్వాత ముఖ్యమంత్రిగా బ్రహ్మానంద గారు వచ్చినారు 1965 లో.

వంత:—అప్పుడు మరలా ఏ.సి. గారిని మంత్రిగాతీసుకున్నా

కథ:— తీసుకున్నారు. బ్రహ్మానందరెడ్డి అతి సన్నిహితుల యిద్దరు మంత్రులు మెలగుచున్నప్పుడు నెల్లూరు రాజకీయాలు ము మంత్రివరకు పోయి, మంత్రుల సన్నిహితం చెడినది.

హాస్య:—మరల 1967 లో జనరల్ ఎన్నికలు జరిగినవట

కథ:— జరిగినవి. మరలా రాపూరులో నిలిచారు.

వంత:— వీరికి అప్పుడు ఏపార్టీ పోటీపెట్టినది ?

— ర గ డ —

అన్ని పార్టీలు ఏ. సి. గారికి అండగనిలిచారు ||తం

కమ్యూనిస్టులుకూడా ఏ. సి. గెలవాలన్నారు ||తం

వున్నది ఒక్కటి వీరికిపోటీ వుమనోప్పించలు ॥తం॥
అవియేమంటే తెలియజెప్పెదను ఆలకించుడయ్యా ॥తం॥
మనవారంటే దగ్గరతీసె మహనీయుడు ఏ. సి. ॥తం॥
అట్టివారె వీరికెదురునిల్వను ఏర్పడియున్నారు ॥తం॥
గురువుగారు మీానెత్తిన హస్తము పెడతామన్నారు ॥తం॥
భస్మాసురుడు పరమశివునికి పెట్టినతీరుగను ॥తం॥
లోకకళ్యాణుని మూడవనేత్రము తెరచకున్నవరకు ॥తం॥
తెరచిచూాడగ మిత్రద్రోహులు దగ్ధంబయ్యారు ॥తం॥
తప్పిపోయినవారు తిరిగి తనదరికిచేరగాను ॥తం॥
శాంతమూర్తియై తనసాన్నిధ్యము చేర్చును మన ఏ.సి. ॥తం॥
ఆదరించు తన ఆప్తులవలెనే ఆనందముతోను ॥తం॥
శ్రద్ధగనేర్పును, సకలగుణంబులు సహచరులకునెపుడు ॥తం॥

కథ:— తన సహచర మిత్రులే, స్వతంత్రంగా పోటీ చేశారు ఏ. సి. గారితో.

వంత:— అప్పుడు రాపూరుప్రజలు ఎటు మొగ్గుచూపించారు?

కథ:— ఏ. సి. గారు వారి తాలూకాకు మంత్రిఅయినతర్వాత చేసిన పనులన్నీ ఒకరికొకరు చెప్పుకొనుచూ, సుబ్బారెడ్డిగారిని అత్యధిక మెజారిటీతో గెలిపించారు. రాపూరు ప్రజలు.

హాస్య:— మరలా ముఖ్యమంత్రిగా ఎవరినైనా సూచించారా?

వంత:— కాంగ్రెస్‌పార్టీ నాయకునిగా బ్రహ్మానందరెడ్డిగారి పేరు ఏ. సి. గారే చెప్పారటగా.

కథ:— అవును - ముఖ్యమంత్రిగా బ్రహ్మానంద రెడ్డిగారు వుంటూ 1967 జూన్‌లో హోంశాఖామంత్రిగ ఏ. సి. గారిని వుండ వలసిందిగా కోరారు - అందుకు వారు అంగీకరించారు. మంత్రిపద విని నిర్విఘ్నముగా నెరవేరుస్తున్న ఏ. సి. గారికి —

హాస్య:— ఏమైనదండీ ?

## జబ్బులో ఏ. సి. గారి అస్వస్థత

— రగడ —

కాసరానియా కాన్సరువ్యాధి కనుపడె ఏ. సీ. కి ||తం||
చెన్నపట్టణము చేరగవలెనని చెప్పిరి డాక్టర్లు ||తం||
హైదరబాదును విడచివెళ్ళిరి అందరు మద్రాసు ||తం||
కాన్సరు ఇన్‌స్టూట్ కడకుచేరిరి కలవారందరును ||తం||

కథ:— మద్రాసు అడియారులోని కాన్సర్ ఇన్‌స్టూ ట్ లో స్పెషల్ వార్డులో ఏర్ కండిషన్-రూములో చేరారు ఏ. సి. గారు.

వంత:— ప్రముఖడాక్టర్లంతా వచ్చిచూచారా ?

కథ:— చూచారు-కావలసిన వైద్యసహాయాలన్నీ చేశారు — మీకు త్వరలో నయమౌతుంది - విశ్రాంతి అవసరమన్నారు డాక్టర్లు.

హాస్య:— ఎవరైనా వచ్చిపోయే మాబోటివారికి ఒక టయిమని ఏర్పాటుచేశారా ?

కథ:— చేశారు.

— రగడ —

నాలుగుగంటల టయిమని చెప్పిరి నాయకునికి వారు ॥తం॥
పత్రికీనయ్య ప్రక్కనేయుండెను ప్రాణమిత్రునిగను ॥తం॥
వచ్చిపోయెడివారిని పంపును వరుసక్రమంబుగను ॥తం॥
యివ్విధమ్మున కొన్నిదినమ్ములు ఏర్పాట్లుజరిగె ॥తం॥
సందులేని యీజనప్రవాహము సమయములేదయ్యె ॥తం

వంత:— టయిములేని టయిములోకూడా రానిచ్చేవారా ?

కథ:—ఏమిచేయమంటారు, ప్రజానాయకుని చూడవలెనని అర వందల మైళ్ళనుంచికూడా వచ్చినవారున్నారే! మరలా రమ్మనటము భావ్యముకాదని-అప్పుడే రమ్మనేవాడు-మన నాయకులు ఏ.సి. గారు.

వంత:— ఈవిధంగా విశ్రాంతిలేకుంటే వారి ఆరోగ్యం కోలు కున్నదా ?

కథ:— మద్రాస్‌లో వున్నవరకు - ఆరోగ్యంగానే వున్నారు, వైద్యం పూర్తిచేసి విశ్రాంతి అవసరమన్నారు డాక్టర్లు.

వంత:— విశ్రాంతికొరకు యెప్పటికివెళ్ళారు ?

కథ:— విశ్రాంతిలేదూ ఏమీలేదు. ఇంకా జనప్రవాహం తన చుట్టూ చేరే హైద్రాబాదు నగరానికి వెళ్ళారు ఆగష్టులో.

వంత:— అప్పుడు వీరికి విశ్రాంతి యెట్లావుంటుంది ?

కథ:— అదే వీరి ఆరోగ్యాన్ని దెబ్బతీసినది, ఆ రాజధాని నగరములో —

— రగడ —

అందరు నాయకు లిచారించను, అప్పుడు వచ్చారు ||తం||
ఎందరో ప్రజలు వచ్చిరి చూడను అన్నిఘడియలందు ||తం||
విశ్రాంతిగ మీరుండవలెనని, అపుడు చెప్పగను ||తం||
నా ప్రజలే నా బ్రతుకని పలికెను నాయకుండు ఏ. సి. ||తం||
ప్రజలులేని ఈ బ్రతుకెందుకనియని పలికెనపుడు ఏ.సి. ||తం||

కథ:— ఈవిధంగా డాక్టర్లు చెప్పినను, ప్రజాసమూహమే నా బ్రతుకని, తన ప్రాణాన్నికూడా హానితెచ్చుకున్నాడయ్యా - ప్రజా నాయకుడు.

వంత:— మరలా ఆ కఠోర కాన్సరువ్యాధి ముదిరినదా ? ఏమి మహానాయకునికి ?

కథ:— ముదిరక ఏమిచేస్తుంది నాయనా ! విశ్రాంతి లేకుంటే.

— రగడ —

ఘోషిరిఆడినవరకును పలికిరి ఉత్తమనాయకులు ||తం||
ఏవిధి పలుకను వీలులేకున్నను విముఖుడయ్యె నపుడు ||తం||

వంత:— పలుకుటకుకూడా వీలులేకపోయినదా ?

## సెప్టెంబరు 6వ తేది

కథ:— అవును ఆపరిస్థితుల్లోనే, మద్రాసుకు వెంటనే తీసుక పోయారు ప్రజానాయకుణ్ణి.

వంత:— అప్పుడు ఎచ్చట చేర్చారండి అజాతశత్రుణ్ణి.

కథ:— హెచ్. టి. వీరారెడ్డిగారి ప్రయివేటుహాస్పిటల్లో చేర్చిన వెంటనే వూపిరిసలుపుకొనేటట్లు చేశారు డాక్టర్లు.

వంత;— వ్యాధి తిరుగుముఖంపట్టినదా; మధురహృదయునికి.

కథ:— లేదు. దినదినానికి ఆరోగ్యాన్ని క్షీణింపచేస్తూ!

— రగడ —

దీనజనుని ఆత్మకు కనపడె దివ్యమైనజ్యోతి ||తం||
ఆజ్యోతిలో లీనమయ్యెను, ఆనమయ్య ఆత్మ ||తం||
మహానాయకుడు కన్నుమూసెను మానవలోకాన ||తం||

## దుఃఖము

కథ:— 1967 సెప్టెంబరు 20వ తేది సాయంత్రం 5-40 గంటలకు పి. సి. సుబ్బారెడ్డిగారి పవిత్రాత్మ అనంతంలో లీనమైపోయినదని ఆకాశవాణిలో అపుడే చెప్పారు. అకలంక దేశభక్తుని మరణవార్త దేశమంతా !......

— రగడ —

వినువీధివాణిలో వివరించిచెప్పారు, వీరమరణవార్త ||తం||
కన్నీరుమున్నీరుకార్చారు ప్రజలంత కడుపుశోకమ్ము
వలెనూ ||తం||

కథ:— ఇవ్విధముగా ఆంధ్రాలో వున్న ప్రజలు దుఃఖిస్తూ

యుంటే, అచ్చట ఏ. సి. భౌతికదేహాన్ని మద్రాస్ ప్రభుత్వంవా
రాజలాంచనాలతో నెల్లూరు పంపే ఏర్పాట్లుచేస్తూ ఏ. సి. భౌతి
దేహముపై పూలగుచ్ఛా లుంచారయ్యా !

హాస్య:— ఎవరండీ ?

— రగడ —

భారతకాంగ్రెసు ప్రధానాధ్యక్షులు కామరాజునాడు ॥తం॥
పూలగుచ్ఛమొకటుంచి చెప్పె బాష్పాంజలి ఆనాడు ॥తం॥
మద్రాసుప్రభుత్వ ముఖ్యమంత్రి, పెద్దమాలతెచ్చి వేసి ॥తం॥
అన్నా! పోతివ 'ఆంధ్ర'నువీడి, అన్నారు అన్నాదురై ॥తం॥

కథ:— ఈవిధంగా అనేకమంది పెద్దలు, పుష్పగుచ్ఛాలుం
మద్రాసునగర పొలిమేరవరకు అరువది కార్లు ముందువెనుక సాన
భూతిగా సాగనంపారయ్యా !

— రగడ —

పోలీసువ్యానులో పంపుచున్నారా, ప్రభుత్వమ్మువారు ॥తం॥
రాజవీధిలో బయలుదేరె. మన రతనపుదేహంబు ॥తం॥
దారిపొడవు దణ్ణమ్ములుబెట్టగ, తరలె నిర్జీవమ్ము ॥తం॥
నిశీథరాత్రికి పైనవచ్చె నెల్లూరుకు శకటమ్ము ॥తం॥

కథ:— ఏ. సి. గారి వజ్రదేహము నెల్లూరుకు రాకముందే
వి. ఆర్. కాలేజి మైదానములో చూడవచ్చుని, తెలిసిన ప్రజానీకము
వరుసక్రమంలో నిలిచిచూస్తూ ఏవిధంగా చింతిస్తున్నారయ్యా అంటే!

వంత:— ఏవిధంగానో చెప్పండి !

— కీర్తన —

పోయినావా, ఏ. సి. ప్రొద్దుగ్రుంగకముందే
పోయె నీ అసువులు పొగమంచువోలే ||పో||

చెన్నపురిలో నీవు చేరావు అనుకొంటే
చేరి నీవు బాగా సౌఖ్యపడుదువనుకొంటే ||పో||

వినువీధివాణిలో విన్నారు నీ ప్రజలు
కన్నీరు కార్చారు కాలమైనావని ||పో||

అధికారులొచ్చారు, అనధికారులొచ్చారు
అందరున్నూకూడి ఆంధ్రాకుచేర్చారు ||పో||

ఆంధ్రప్రజలంతా ఆరోజె వచ్చారు
అయ్యా ! పోతివా యని అల్లాడిపోయారు ||పో||

నెల్లూరు ప్రజలంతా నినుచూడ వచ్చారు
ఆబాలగోపాల మల్లాడిపోయారు ||పో||

కథ:— దుఃఖాతిశయముతోయున్న ప్రజానీకాన్ని తొలగించి రాజలాంఛనాలతో బయలుదేరింది మన నాయకుని పూలపాన్పుపై భౌతికదేహమున్న - పోలీసువ్యాను, రాజవీధులన్నీ తిరిగి స్మశాన వాటికకు—

**వంత:— ఆ ఉత్సవముతో వచ్చిన జనసమూహాన్ని ఎంతని వర్ణించారయా !**

— రగడ —

ఇంతజనంబని వర్ణించుటకును ఎవ్వరితరమౌను ||తం||
లక్షలాదిగా వచ్చిరి జనమని ఇచ్చిరి లేఖలును ||తం||
పూలమాలలే వేయనివారాపురమున లేరండీ ||తం||

కథ:— ఈవిధంగా బయలుదేరి పెన్నార్ బ్రిడ్జిప్రక్క అమర్చి యున్న శ్మశానవేదికపైచేర్చి చితినంటించారు పెద్దకుమారుడు వెంకట సుబ్బారెడ్డిగారు.

వంత:— చితి భస్మమయ్యేవరకు ప్రజలు కదలలేదుగదా ?

కథ:— లేదు. మద్రాస్‌నుంచి ఏ. సి. భౌతికదేహమువెంట వచ్చిన కేంద్రమంత్రి రఘునాథరెడ్డిగారు లోక్‌సభ సభాధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారు, ఆంధ్ర ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి గారు, మున్సిపాలిటీమంత్రి యన్. చెంచురామానాయుడుగారు ఏ. సి. గారి ఆత్మశాంతికొరకు మౌనంగా నిలిచి సంతాపాన్ని తెలిపారు.

— పద్యం —

నిప్పులందు గలసె - నిలువెత్తు దేహంబు
బొగ్గులందుగలసి - బూదియాయె
మేటి ఏ. సి. తనువు - ఏటిపాలైపోయె
నాటి సింహపురము బోసిపోయె !

కథ:— చితి భస్మమైన తర్వాత తిరిగిపోతూ ప్రజలు వైరాగ్యముతో ఏమంటున్నారో తెలుసా ?

వంత:— ఏమన్నారు చెప్పండి.

— రగడ —

శ్రీయీశుని అనుజ్ఞ లేనిదే, చీమకుట్టదంద్రు ||తం||
పెద్దలు చెప్పిన అనుభవవాక్యము పెన్నిధియైయుండె ||తం||
శ్రీకృష్ణుని నిర్యాణముచేసింది, చిన్నకిరాతుండా ? ||తం||
గాంధిమహాత్ముని కాల్చిచంపినది గాడ్సే అనగలమా ||తం||
ఏ. సి. రెడ్డిని ఎత్తుకపోయింది వెధ కాన్సరేనా ||తం||
భగవంతుడు తానిర్దోషగుటకు పెట్టును కారణము ||తం||
ఆయస్సుకు, కర్తలుకామెవ్వరు అనుభవజ్ఞులారా ||తం||

కథ:— ఇట్లు తలంచుకొని యిల్లుచేరింది లక్షలాది ప్రజానీకము. క్రుంగిపోతున్న సూర్యుణ్ణి తిలకించుచూ.





# స్వర్గారోహణ

వంత:— ఈవిధంగా యీ లోకములో యుండగా ? 'అరిగె ఆశాజ్యోతి అమరపురికి' అన్నారే? అనాడు కవులు, స్వర్గారోహణం చెప్పలేదే ?

కథ:— అదే ! చెప్పబోతున్నా విను. యమపురిలో భారత కాలమానం ప్రకారం, సాయంత్రం 5 గంటలకు మహిళామండలి సమావేశము యమధర్మరాజు భార్య శ్రీమతి శ్యామలాదేవిగారి అధ్య క్షతన సమావేశము జరుగుచున్న సమయములో, అశరీరవాణిద్వారా అన్నిలోకాలకు ఏ. సి గారి ఆయుర్దాయం పూర్తిఅయిందని తెలియ జేయడమైనది. మీలోకానికి ఏ. సి. గారిని తీసుకొస్తే, చాల బాగుం టుందని చల్లగ చెప్పి వెళ్ళిపోయేరు నారదులవారు. వెంటనే సమావేశానా పుజేసి ఏమనుకున్నారయ్యా అంటే.

— రగడ —

భూలోకమ్మున భారతభూమను పుణ్యభూమియుండె ॥తం॥
ఆ దేశములో అన్నపూర్ణయను ఆంధ్ర దేశముండే ॥తం॥
ఆంధ్ర దేశమున. పోలీసుమంత్రయి అనుభవించినట్టి ॥తం॥
ఏ. సి. రెడ్డి తేజజ్యోతిని యిటకు తెప్పించండీ ॥తం॥
తీర్మానము ఏకముగా జరిపిరి, తెలుగుమంత్రికొరకు ॥తం॥

కథ:— ఏవిధముగానైనాసరే, మనలోకానికి వచ్చేటట్లుగా చేస్తా మన్నారు అధ్యక్ష-కార్యదర్శులు. సభ ముగిసింది. నేరుగా బయలు దేరారు.

వంత:— యెచటికి ?

కథ:—యమపురి రాజ్య ప్రధాన కార్యదర్శిగారైన చిత్రగుప్తుని యింటికి.

హాస్య:— వీరి నివేదిక యిస్తే ఏమన్నారు ?

కథ:— తప్పుతుందా అన్నారు. కాని ఆలోచన పొరకక ఆలోచించాడు. కళ్ళద్దాల్లో పైకిచూచి.

వంత:— ఏమైన స్ఫురణకు వచ్చిందా స్వామి !

కథ:— ఆఁ వచ్చింది ! మును, ధర్మరాజులవారికిని, మన అభి మానముకొద్ది ఈలోకానికి పిలిచి సన్మానించిన తర్వాత పంపాము నురలోకానికి - ఉన్నతాధికారులనురావించి- శ్రేయోభిలాషులారా!

వంత:— స్వామీ !

కథ:— రాజకీయనాయకులకై ప్రత్యేకించియున్న 'రాజహంస' అనే పుష్పకవిమానాన్ని తీసుకొనిపోయి, నెల్లూరు రాజధానిలో నివాసమున్న ఆంధ్ర పోలీసుమంత్రి ఏ. సి. గారి అమృత హృద యాన్ని తక్షణం తీసుకరావాలి, అని చెప్పుట పూర్తికాకముందే బయలుదేరిపోయారు ఉన్నతాధికారులు !

హాస్య:— పోక తప్పుతుందా ? ఇంకోగా దేవదూతలు తీసుకో ఫో ఘూఘూ! ఇక వీరిగతి సాయంత్రంవుంది హాటు ఖుదా ఫెడా! ఇంట్లో.

కథ:_ వుండవయ్యా నీది మరీనూ ! ఉన్నతాధికార్లు పోవు నప్పటికి ఏ. సి. గారి ఆయుర్దాయం పూర్తయింది 5.40 గంటలకు. వెంటనే తీసుకొనివచ్చారు. అకలంక దేశభక్తుని ఆత్మదేహాన్ని. ఏమిటి చిత్రగుప్తా శబ్దం (అన్నారు యమధర్మరాజు)

వంత:_ శ్రీ ఏ. సి. గారి అమృత హృదయాన్ని మన లోకానికి తెస్తున్నారు ప్రభూ! మన ఉన్నతాధికారులు.

— పద్యం —

అరెరే! యిమ్మహామహు నిట కేలన్ దెచ్చితిరిరా !
నిష్కల్మష నీతిన్ పాలించినారే! రాజకీయాని,
దుష్కపట, దుర్మార్గసమానంబని యెంచినారా ?
వీరిన్ త్వరితన్ గొనిపోవమురంతు ఇంద్రాదిలోకంబులకున్

కథ:_ నాకు తెలియజేయకనే ఎందుకు పంపావయ్యా !

హాస్య:_ మహిళామండలివారి అజ్ఞ ప్రభూ! (అనగానే వల్లబడ్డారు యమధర్మరాజు).

కథ:_ అయితే త్వరగా పోదముపదా! అహ్వానానికి. (అని తన సపరివారమంతా వెంటరాగా బయలుదేరారు)

వంత:_ లోకాధిలోక ధర్మాది, ధర్మప్రభువైన "యమధర్మరాజే" ఆహ్వానానికొస్తున్నాడని; 'రాజదూత' అనే "పుష్పక" విమానాన్నుంచి, యేవిధంగా దిగుతున్నారయ్యా ! అమరజీవియైన అతాను భావాడు.

— పద్యం —

పొందూరు ఖద్దరుపంచ జారగట్టి
అందమగు 'లాల్చి' జోబులో హస్తములుబెట్టి
పుష్పకమ్మును దిగుచున్న పూజ్యునకును
పూలమాలలు వేసి రప్పారమానందు.

హాస్య:— మహిళామండలివారు ముందుగానే తయారుచేశారుగా!

కథ:— ఒక్క మహిళామండలేకాదు! ధర్మపురిలోయున్న అన్నిసంఘాలవారున్నూ వేశారు మాలలు. యమధర్మరాజు చిత్ర గుప్తులవారు ముందుగానే వేశారు. మనకొరకు ధర్మపురోద్యానవన ములో దేవవిమానాలు వేంచేసియున్నవి, త్వరగా విమానాశ్రయానికి పోదముపదండి ఏ. సి.

హాస్య:— ఒరదహా మీలోకం చూచిపోదాంసార్ (అన్నారు అమృతజీవి)

కథ:— ఎందుకబ్బా! అంటూనే బయలుదేరారు (తప్పనిస రనుకొని)

హాస్య:— ఏమబ్బా అయనగారికంత కష్టం, ఏమి తీసుకెళ్ళు తారని, యమలోకాన్నుంచి!

కథ:— అదికాదురా సన్యాసీ! ఆయనబాధ. రెండులక్షల బాబా ఆ ప్రజదేహాన్ని నాలుగుమైళ్ళ పొడవు నెల్లూరు నడివీధుల్లో సాగనంపారే! ఆ ప్రజాహృదయం మన లోకాన్ని పూర్తిగా చూస్తే పాపులంతా పుణ్యులౌతారే, అని.

వంత:— పోనీండి వీరికి పనే తగ్గుతుందిగా. ఓహో వారక్కడ మిగులుతారనా ? రిట్రెంచ్‌మెంటయిస్తే పోయె.

హాస్య:— వీరెవరండీ !

— పద్యం —

1. కంట్రాక్టులను తీసి, మట్టికట్టడములనుగట్టి
కూలద్రోయించిన కుమతలీరు.

వంత:— ఓహో! వీరా! ఓకేదపాలేండి కాంట్రాక్టుజేసింది. వీరు చేసిన నేరానికి వీరి ఆస్తులన్నీ గవర్నమెంటువారు స్వాధీనం చేసుకున్నారు.

హాస్య:— సరే! వీరెవరండీ ?

2. ప్రభుత్వనిధికి, ప్రతినిధిని సృష్టించి
దొంగకరెన్సీ బెంచిన ధూర్తులీరు.

వంత:— ఓరి వీళ్ళ దుంపదెంచా! - వీరెవరండీ ?

3. లైసెన్సులనుదీసి "రైసు"లో "రాళ్లు" మట్టి
కలిపిన రండమతులు వీరు.

హాస్య:— అన్యాయమేనండి - ఈమహానుభావు లెవరండి.

యమ:— ఈ లాట్ఫీలవారెవరు చిత్రగుప్తా ? [చిత్రగుప్తుడు యముని చెవిలో చెప్పును] ఓహో !

4. ప్రజాప్రతినిధులని ప్రజలెన్నుకొనిబంప
ప్రజల కంటబడకున్న పాపులీరు !

వంత:— మూడువందల నియోజకవర్గాలు. వదహారుపార్టీలు వున్నవనుకున్నారేమోలేండి! పాపం.

ఇట్టివారలెందరో యున్నారు
ఇప్పారమునందు, ఇప్పుడుజూడ
తడవులేదాయె, నెన్నంట తరలవలయు
అసురపురిచేర, విమానాశ్రయముకు ఏ. సి.

కథ:— ఏ. సి. గారు చూచినందువల్ల విడుదలచేయబడ్డ ఇరువదివేల జనంబుతో, ధర్మపురి విమానాశ్రయానికి బయలుదేరారు.

హాస్య:— ఇంద్రపురి విషయమే చెప్పలేదే ?

కథ:— చెప్పబోతున్న ఘడియలోనే తకీమని ప్రశ్నిస్తావు. నీ బుద్ధి చాలా పెద్దదేనబ్బాయ్. విను పుణ్యపురుషులైన భారత ప్రముఖులంతా ఏ.సి. గారి తేజజ్యోతికై ఎదురుజూస్తూ గాంధిగారి ఆశ్రమంలో సమావేశమైయుండగా, రోజుతూ రొప్పుతూ పరుగున వచ్చారండీ!

హాస్య:— ఎవరండీ ?

కథ:— నారదులవారు - ఏ. సి. గారు యమలోకములో యున్నారని ప్రకాశంగారి చెవిలో వూదేసి వెళ్ళిపోయారు కలహప్రియుడు. ఆంధ్రకేసరి ఘర్జనతో లేశారు ప్రముఖనాయకులంతా.

— రగడ —

అట్టిమేటమొకటప్పుడు పంపిరి, ఆఇంద్రసభకు ||తం||
అత్యవసర సమావేశమును, అపుడుజరుపుడంచు ||తం||

హాస్య:— అమరలోక సభాసభ్యత్వాలు కలిగియున్నారా? షనవారు.

కథ:— అపును నామినేటెడ్-మెంబర్లుగా కో-అప్టు చేసుకొని యున్నారు ప్రముఖ నాయకుల్ని.

కథ:— నివాస మందిరాన్నుంచి సురరాజు సభామందిరాని కొస్తూయుంటే - చల్లగా తప్పుకొని లోనికివెళ్తున్నాడు కలహప్రియుడు శచీదేవిగారి చెవిలో చెప్పివస్తామని—

హాస్య:— ఏమని ?

కథ:— మన దేవదూతల అసమర్థతవల్ల యమపురికి ముందుగా తెప్పించుకున్నారు ఏ. సి. గారి అమృతహృదయాన్ని ఆ మహిళా మండలివారు అని— అది గ్రహించిన సురరాజు నారదా! అన్నారు.

హాస్య:—లోనికెళ్ళి మంచినీళ్ళు తాగివస్తా.

కథ:— నీకు కావలసినంత అమృతపానమిస్తా నీవు రావయ్యా స్వామీ! రాత్రికి ఇంట్లోనన్నా కాస్త విశ్రాంతుంటుంది. అని చేయి పట్టుకొని బ్రతిమిలాడుతూ తీసికెళ్ళి వుచితాసనంపై యుంచి - సుర సభాధ్యక్ష స్థానాన్నలంకరించారు దేవరాజు.

హాస్య:— మన బారిష్టర్లు ఎవరెవరు వచ్చారు. ఎట్లా వాదించారో చెప్పండి ?

— ౪౫౮ —

బూలాబాయి దేశాయిగారు, పండితనెహ్రూలు

తం॥ న తానె॥

సర్దార్ పటేల్. ఆంధ్రకేసరి సమపుజ్జీవులుగను ॥తం॥

యమలోకానికి ఏ.సి.ని పంప మీకేమిహక్కు—వుంది ॥తం॥

నిష్కళంక పరిపాలనజేసిన నీతిమంతుడతడు ||తం||
ఏ. సి. అంటే సామాన్యుండని ఎంచినారమీరు ||తం||
బల్లగుద్ది వాదించారప్పుడు భారతప్లీడర్లు ||తం||

కథ:— ఇట్లా వాదిస్తున్న భారత బారిష్టర్ల నుద్దేశించి అమర లోక అధికారన్యాయవాదియైన సురగురువులేచి

వంత:— ఏమన్నారయ్యా ?

కథ:— భారతరాజ్యాంగ రచనావిధానాగ్రగణ్యులారా! ప్రజా స్వామ్య సామ్రాజ్య ప్రధానాధికారులారా! పండితులారా! మీకు తెలియని న్యాయాన్యాయములు లేవు. ''యమః'' అనగా ధర్మానికి మారుపేరని - మీ అనుంగుమిత్రుడు ఏ. సి. పోయినందునేకదా! ఇరువదివేల జనంబులకు స్వర్గప్రాప్తి కలిగినది. వారు వెంటనే పుష్పక విమానముపై వచ్చుచున్నారు. ఏ. సి. గారి ఆహ్వానానికై మేము తగు ఏర్పాట్లు చేసియున్నాము. వారి అనుంగుమిత్రుని ఆహ్వాన సంఘాధ్యక్షులుగా - పరిశీలనార్థం మీరును పంపుడు.

వంత:— అనగా! ఎవరిని ఏర్పాటుచేశారండీ?

— రగడ —

అస్పృశ్యతనివారణ అట్టిగట్టుకొని అచ్చటనేయుండె ||తం||
అమరజీవి పొట్టిశ్రీరాములుగారిని అర్థించారంతా ||తం||

వంత:— ఒప్పుకున్నారా! పదవీవ్యామోహ మెరుంగని పావనమూర్తి''

కథ:— తన మిత్రుడు వస్తున్నాడని తప్పక ఒప్పుకున్నాడు. నందనోద్యానవనములో, అప్సరాంగన లందరు తగు ఏర్పాట్లలో వున్నారు. మీరుపోయి పరిశీలించిరాండని సురరాజు కోరగా ఆహ్వాన సంఘాధ్యక్షులు బయలుదేరిపోయారు.

వంత:— అమరజీవి పోవునప్పటికి అచ్చటి ఏర్పాట్లు ఎట్లా వున్నవి చెప్పండి?

కథ:— ఆ వనసౌందర్యం యెట్లావున్నదంటే !

— రగడ —

వెండివెన్నెలకు జల్తారుల్పోసిన యట్లగుపడుచుండె ||తం||
పారిజాత పుష్పాలంకారము పరిమళించుచుండె ||తం||
ఎఱ్రగులాబీలు, తెల్లమల్లెలు, ఎన్నోరంగుపూలు ||తం||

హాస్య:— వనసౌందర్యం కాదండి, అచ్చట వారకాంతల విషయం చెప్పండి ?

కథ:— అదా ! చెపుతున్నా !

— రగడ —

అతిసన్నని వస్త్రాలుధరించిరి అర్ధనగ్నముగనూ ||తం||
అగుపడుచుండెను అంగములన్నియు అంగనాంగనలకు||తం||
అరటిస్థంభములంటి నున్నని తొడలగుపడుచుండె ||తం||
హంసనడక వయ్యారముగానడ అగుపడె సిరుంధులు ||తం||
అట్టిసమయమున అటకేతెంచెను ఆహ్వానఅధ్యక్షుడు ||తం||

హాస్య:— వీరి నడవడికలుజూచి ఏమన్నారయ్యా అమరజీవి ?

కథ:— అమ్మా ! ఇలాంటి కోరికలతో, రాజసూయాది యాగములు జేసివచ్చిన రాజాధిరాజులకేగాని, మాప్రజాప్రతినిధులకు వనికిరావు. ముందు మీరు వస్త్రాలుధరించి బయలుదేరండి! అన్నారు.

హాస్య:— వస్త్రాలు వున్నవయ్యా ! ని-వుల్లిపొరలాంటి తన వాల్ పైట పైకెత్తుచూ వచ్చిందొక వారకాంత.

కథ:— కళ్లుమూసుకొని, యివి వనికిరావన్నారు అమరజీవి.

హాస్య:— అయితే ఏమిచేయమంటారు స్వామీ? అన్నారు అప్సరాంగనలు.

కథ:— పొందూరుఖద్దరు వస్త్రాలు ధరించి బయలుదేరండి !

హాస్య:— ఇంకానయ్యం - "కందుకూరుదువ్వట్లు" కట్టుకొని రమ్మనలేదు పాపం! - (అనగా అందరు గొల్లున నవ్వారు).

వంత:— మీకొరకుకాదు స్వామీ యీ యేర్పాట్లన్నీ చిరు నవ్వులు తాండవమాడే రసికుడు, రసజ్ఞుడు అయిన ఏ.సి.గారి కొరకు (అన్నదొక నవాంగన).

కథ:— మా ఏ. సి. "చిరునవ్వులు" అప్యాయతనిచ్చేవేగాని రసజ్ఞత నిచ్చేవిగావమ్మా!

హాస్య:— రసజ్ఞుల రసజ్ఞత నీకేమిదెలుస్తుందయ్యా!- యేక పత్నాంతర బ్రహ్మచారి! అని, బుగ్గపొడుస్తూ అన్నది మందారవల్లి.

— ర గ డ —

జ్యోతులు, తేళ్ళట్లగపడె తేజశ్శాలికపుడు ॥తం॥
ఆకోపంబున బయలుదేరెను ఆశ్రమానికపుడె ॥తం॥

వంత.— హడావుడిగా వచ్చిన "అమరజీవి"ని చూచిన పెద్దలు ఏమన్నారండీ?

— ర గ డ —

ఏమి శ్రీరాములు ఏర్పాట్లన్నియు అయినవ అన్నారు ॥తం॥
మౌనముగాయున్న మన "తాతగనుగొనె మానదృష్టితోనె ॥తం॥

హాస్య.— తాతెవరండోయ్?

కథ:— మహాత్మాగాంధిగారు.

— ర గ డ —

ఎవరెవరున్నారో 'సింహపురీ'యులు వెళ్ళండియన్నారు॥తం॥
సురరాజుకు యీనేరంబంతయు శుద్ధిగజెప్పండి ॥తం॥
మనసాంప్రదాయమున, రాకున్నను, మరలిపొమ్మనండి ॥తం॥

వంత: మన నెల్లూరువా రెవరెవరున్నారండి! అచట ?

— రగడ —

పౌనకా కనకమ్మ పుణ్యవతియు గాంధీప్రార్థనమునుండె ॥తం॥

ఆనాటి చెంచులక్ష్మమ్మ, కనకమ్మ వెనువెంటనెయుండె ॥తం॥

'జమీన్‌రైతు' రామానాయుని తేజస్సటనుండె ॥తం॥

మన్నెపల్లి హనుమంత్రావ్ మహాగియుముయుండె ॥తం॥

దొడ్ల సుబ్బారెడ్డి 'ధర్మాత్ముడు' ఆదరిలోనేయుండె ॥తం॥

వంత:— నెల్లూరు నాయకులంతా బయలుదేరి పోయారా ? అవున్లెండి ! మన మర్యాదలు మనకు తెలుసు !

హాస్య:— మన మన్నెపల్లి వీరంతా కాస్త మందపాటివారేనే? ఎవరైనా కాస్త హుషారైనవారున్నారా? అని నా సందేహం.

కథ:— ఆశ్రమంగేటు దాటనివ్వవయ్యా! బాపూజీవున్నారు.

వంత:— దాటామగదా ! చెప్పండి.

కథ:— శ్రీరాములుగారిని చూస్తుండగనే తయారుచేశారు మన రామానాయుడు.

హాస్య:— యెట్లా ?

## ఇంద్రపురిలో జరుగు అన్యాయాలు
## "ఏ. సి. గారి ఆహ్వానసంఘాధ్యక్షునిపై అప్సరసలు జరిపిన అఘాయిత్యాలు"

"మేనకపుత్రిక మెండారివక్షో మొరకు సరసం"

అని తాటికాయంత అక్షరాలతో తయారుచేసి ముద్రుకర్రతో బయలుదేరారు "జమీన్‌రైతు" రామానాయుడు ! (దేవేంద్రునివద్దకు)

కథ:— ఏమండీ! యేర్పాట్లన్నీ పూర్తయినవా! అన్నారు. ప్రయాణానికి సిద్ధంగాయున్న దేవరాజు, (తన్ను ఆహ్వానిస్తాని కొచ్చారనుకొని)

హాస్య:— పై పేపరున్యూస్ చూపించారు నాయుడుగారు.

కథ:— పేపరుమాత్రం పంపకండి! మీరు యెట్లాచెపితే అట్లా సర్దుకపోతాము— లేనిపోని గొడవ అన్ని లోకాలకు పాకిపోతుం దన్నారు అమరనాయుడు.)

హాస్య:— అయితే మీ అవ్సరసలంతా మా ఖద్దరుచీరలుధరించి రావాలి అన్నారు కనకమ్మగారు. నేరము చేసిన "మందారవల్లి" మాత్రం కందుకూరుచీరె కట్టితీరాలి.

వంత:— దీళ్ళగోచి పెట్టితీరాలండోయ్.

కథ:— వళ్ళు పనికొస్తుందాండి? యీ రెండుఫర్లాంగులు నడిచి తిరిగివస్తే!

హాస్య:— అది వేరేవిషయము— మీకు ఇష్టంలేకపోతే పేపర్ న్యూస్ (అన్నారు నాయుడు).

వంత:— వద్దులేండి. వచ్చి యేదైనా పసర్లు రాసుకుంటారు. (అని దీనాలాపంగా అన్నారు దేవరాజు). యింకా యేమి చేయాలో చెప్పండి.

— రగడ —

సందులేని పందిర్లేయించాలి సభాస్థలివరకు ॥తం॥
ఖద్దరుశాల్వాలు కట్టించవలెను గడపలగపడకుండ ॥తం॥
త్రివర్ణపతాక తోరణమ్ములు తీర్చిదిద్దవలెను ॥తం॥

వంత:— యింత త్వరగా అవుతుందాండి!

హాస్య:— న్యూస్!

కథ:— వద్దులెండి పేపరుమాట— మయబ్రహ్మా! నా పరువు నిలపవయ్యా (అన్నారు సురరాజు).

వంత:— అర్థగడియలో తయారుచేస్తాను ప్రభూ! (యీ విధంగా ఆహ్వానానికి కావలసిన యేర్పాట్లన్నీ చేయించి, అమర రాజ వీధిలో సౌందర్యహాలులో "ఖాదీ" బోర్డు అధ్యక్షులు తుమ్మలపల్ల రంగయ్యగారు యున్నారు) అచటికిపోయి.

హాస్య:— ఏమి రంగయ్యా! ఏ.సి. గారి ఆహ్వానసంఘములో యుండి యింకా బయల్దేరలేదేమిటయ్యా (అన్నాడు హనుమంత్రావ్).

కథ:— ఏమిచేయమంటారుసార్! ఏ.సి. గారు అమరలోకాని కొస్తున్నారని "సబ్స్టాండ్" గూడ్సు తెప్పించాము అఫ్రేట్లో అందులో— స్పెషల్ రిబేటు ట్వంటి పర్సెంట్. యిక థర్టిపర్సెంట్ కొస్తుందని ఉదయంమొదలు ఇప్పటివరకు తెరపి లేదండి నేను బయలుదేరి వస్తునా— యింతలో మీరు వచ్చారు— యేమిటివిశేషం? (అన్నారు ఖద్దరుటోపీతోవున్న కాంగ్రెసువాది రంగయ్య)

వంత:— ఇచ్చట కొంత సరుకు కావాలి రంగయ్య.

కథ:— ఏ. సి. గారు రాజవీధుల్లో నడచివచ్చునపుడు అడు గులక్రింద పరచె వుడువులన్ని పంపేను యమ బ్రహ్మ దేవేంద్రుని పద్దుమీద. కావలసినవన్నీ తెప్పించుకొన్నారు. ఇక కొట్టు మూయ వచ్చుకదాని? బయల్దేరుచున్నామండి.

హాస్య:— కందుకూరు చీరె కావాలండి?

కథ:— అవి ఇచ్చట కట్టేవారెవరండీ!

వంత:— మందారవల్లికి కావాలి. మీమేనేజరుకుచెప్పి నీవు త్వరగా రావయ్యా! నీకు విషయమంతా పూర్తిగాచెప్తాను (అన్నారు నాయుడుగారు) అందరూ నందనోద్యాన విమానాశ్రయానికి చేరు తారు నాయకులంతా కలసికాగా)

వంత:— ఈవిధంగా అమరపురి భారతనాయకులు, దేవలోక యక్ష, గంధర్వ, కిన్నర. కింపురుషాదులు అందరు చేరారండీ ఆహ్వానానికి.

కథ:— మొట్టమొదట పూలమాల పొట్టిశ్రీరాములు వేశారు!

— రగడ —

పొట్టిశ్రీరాములు పూలనూ లెయ్యగా పొడవయ్యెను ఏ. సి. ॥తం॥

అన్నావ స్తివ, నన్నాహ్వానించను అన్నారు మన ఏ.సి ॥తం॥

ఆప్యాయతగా కౌగలించుకొని అందుకొనెను మాలా ॥తం॥

ఆమాలేసెను 'అమరజీవి'కే ఆనమయ్య అపుడు ॥తం॥

కథ:— అన్నిపార్టీలవారున్నూ అన్నిసంఘాలవారున్నూ ఆదిత్య పురములోని అమరనాయకు లందరున్నూ పూలమాలాలంకృతులను చేశారండీ! అకలంక దేశభక్తునికి.

వంత:— కమ్యూనిస్టుపార్టీ నాయకులున్నూ వచ్చారాండీ?

కథ:— కమ్యూనిస్టుపార్టీ ఏమిటన్నా!— ప్రజాహృదయాన్ని చూరగొన్న ప్రతి పార్టీవారున్నూ అమరపురిలో వున్నారు. అందరున్ను వచ్చారు. పూలమాలలు వేశారు! పూజ్య ఏ. సి. కి

హాస్య:— యీవిధంగా సభాస్థలివరకు నడచివచ్చారుకదా! ఆ కందుకూరుచీరామె విషయమే చెప్పలేదే?

కథ:— చెప్తా విను ఆమె బాధ!

— రగడ —

అప్సరాంగనలందరు ముందుగ అడుగులు వేయగను ॥తం॥

కందుకూరు చీరకట్టిన కన్య కదలలేకపోయె ॥తం॥

కథ:— యిట్లా అడుగులకు మడుగులొత్తుచూ అప్సరసాంగనలు ముందుబోతూ—

— ర గ డ —

పుష్పంబులు మొదజల్లుతువుండిరి పుణ్యపురు
సన్నజాజులు, నన్నెగులాబీలు, సంపంగె మొ
అగరు, జవ్వాది, పన్నీరుజల్లిరి ఆమహానీయ
తెంపులేని పవలొత్తులువేసిరి తేజశ్శాలురకు
దారిపొడవు హారతులందించిరి దేవకాంతల
పూలమాల లేయనివారే లేరాపురమునందు

కథ:— ఇవ్విధముగా దారిపొడవు దేవకాంత
సభాస్థలిలో.

వంత:— ఏమి జరిగిందంటీ ?

— ర గ డ —

తెలుగుముత్తయిదువు లందరునూ్న తనపోచంద్రుని పవిత్ర

ముద్దకర్పూరపు హారతిపట్టిరి ముగ్దులగుచువా

భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి అధ్య
మైన సన్మానసభ జరిపి, కురుగంటి రాఘవరెడ్డిగారి
ణతో సభ ముగిసింది.

~~~~~ సమాప్తి ~~~~~



జనగణమన అధినాయక జయహే
భారత భాగ్య విధాత
~~~~~